# ఆమె చూపిన వెలుగు

(రచనా సంకలనము)



ఘట్టి ఆంజనేయశర్మ



ఆరాధన గ్రంథమాల
మద్రాసు.

ప్రథమ ముద్రణ
నవంబర్, 1952

'ధన్యవాదాలు'

చిత్రకారుడు: శ్రీ మో. వె. రామగోపాల్

'కృతజ్ఞత'

'భారతి' సంపాదకులు: శ్రీ శివలెంక శంభుప్రసాద్,

శ్రీ చందూరు నాగేశ్వరరావు

మూల్యం: రూపాయిన్నర

బి. యన్. కె. ప్రెస్ లిమిటెడ్
మదరాసు - 1

# యాత్రికులుగా మనం

ఆరాధన ఒక సాధన. అనుభూతి పరిశీలన రచనాగమ్యానికి మార్గదర్శకాలు. సంతృప్తిశాంతిగల జీవనాన్ని పొందడంలో సమాజం పొందే నైరాశ్యాన్ని తన పరిశోధనద్వారా పరిశీలించి భవిష్యత్తులో సమాజంచేయగల మరో ఉత్కృష్టరాగానికి ఉపశ్రుతిగా పరిణమింప చేయాలనేకాంక్ష జిజ్ఞాసాపరుడైన ప్రతి సాధకుడిని, కార్యాచరణుడిని చేస్తుంది.

ఈ ఆరాటము, విధి, నైచ్యలోభాలు కలిగించే కష్టాలు, గోర్కీ, ఉమర్, శరత్, చలంవంటివారి సంశోధన (analysis) పురికొల్పిన ఆవేదన (restlessness) సహజంగా కలిగిన స్వభావాన్ని సైతం విస్ఫురింపజేసి జీవితప్రభాతములోనే నిలవద్రొక్కి రాగల రచనచేయడానికి చేయవలసే పోరాటంలో పాల్గొనడానికి ఉత్సాహప్రోద్బల్యాల్ని ప్రసాదించాయి.

ఆనాడు నాజీవితంలో ఒక వికాసారంభం—

నాహృదయానికొక జిజ్ఞాసోదయం—

ఆమె చూపిన వెలుగు!...

విజ్ఞానకాంతుల్ని వెదజల్లే ఒక దివ్యమూర్తి నాకు సాక్షాత్కరించింది. అంధకారంలో ఆశాజ్యోతి! అది ఎంత సహజమో! ఓ భావకుడు మధురంగా వెల్లడించినట్లుగా—

"పిలువనేలేదు తనయంత పిలచె ప్రేమ
ప్రేమ గీతిక లాలపించినది ప్రీతి
తెలియనేలేదు తనయంత వలచి వచ్చి
హృదయవేదిక తాండవించినది కేళి."

ఆ వెలుగులో ఏ మతమూ లేని ఒకలోకం, చీకట్లో అసహాయంగా సంఘంచే పరిత్యజించబడిన ఒక బాలమూర్తి; మానవవిలాసాలకోసం కరకుకత్తికి బలియైపోయే ఓ దీనప్రాణి; సాంఘిక దాస్యశృంఖలాలచే బంధియై తన సర్వస్వాన్ని అర్పించుకొన్న మనోహరుని పొందలేని ఒక భగ్నహృదయ; భారతవర్షంలో అనాదిగా పుడుతూచస్తూ ఎవ్వరికీ తెలియని, చరిత్రకందని ఒక పరిత్యక్త, బిడ్డకోసం జీవితాన్ని అర్పించే ఒక మాతృదేవి; సంఘవ్యవస్థలోని అంతస్తులచే చిన్ననాటి గాఢస్నేహం భేధింపబడగా వికలమైన ఒక మనస్సూ, ఆశ్రయంలేని కారణంగా, విద్యనూ ఆధారాన్ని అన్యాయంగా పోగొట్టుకొన్న ఓ పసివాడూ, సామ్రాజ్యవాదజనిత సంకుచితవిద్యావిధానంవల్ల తన సామర్థ్యం, పరిశ్రమ, ఓర్పు, ఆహుతియైన ఓ అభాగ్యవిద్యార్థి, అభిమానం స్వాతంత్ర్యంకోసం స్వసుఖాన్ని సరకుచేయని ఓ అమరత్యాగి, గోచరించారు. ఇంకా ఆదేవిలో

"Mother, Thou art the soul of all beings,
The supreme truth of all existance
There is nothing higher, nobler
And more abiding than THY SELF."

అని మాతృదర్శన్ కాంచిన విశ్వమాత స్ఫురించింది.

కాలంగడిచిన కొద్దీ మానవుడిలో కొంత మార్పురావడం సహజం- మూలసూత్రాలు ఒకటేమైనా—అందుకే యీ రచనల యిప్పటి వేగాన్ని అందుకోలేకపోతే—అదీ సహజమే.

హిందూసమాజంలోని ఆశ్రితయైన స్త్రీని చిత్రించడమే నా జీవితాశయం. ఈ ఆశ్రితులు యేమానవహృదయంలోనైనా మంటలురేకెత్తించరా? ఈ పుస్తకాన్ని చెత్తగా విసరేసే పాఠకులుసైతం, ఈమంట రేకెత్తించడానికి ఒక అల్పప్రయత్నం జరిగిందని చెప్పుతారనుకుంటాను.

మన సమాజంలోని మాతృదేవులు ఆశ్రితులు. వారియాత్రకు గమ్యం గోచరించడంలేదు.

"మాతృదేవి" చదివి యీ పుస్తకం ఓమూల పారెయ్యండి. మీతో నాకే తగాదాలేదు. అదే నేనుచేసే కనీస విన్నపము. అది నా కల. అది ఒక చిత్రంగా తీయబడి నా ఆరాటాన్ని విస్తృతంగా బహిర్గతంచేస్తుందా? ఆ కథని ఆంగ్లంలో అనువదించమని మిత్రులు అమరేంద్రని అర్థించగా ఆమోదిస్తూ యిలా వ్రాశారు. "మాతృదేవి శ్రద్ధగా చదివాను. నాకు బాగా నచ్చింది. కథలో ఒకవిధమైన తీవ్రత, చిత్తశుద్ధి, ద్యోతక మౌతున్నాయి. రచన ఒకజీవిత శకలంగా,జీవితప్రతిబింబంగా కనుపించింది. కథ ముగింపు "దేవదాసుని" గుర్తింపజేసింది. పాత్రలు జీవంతో నిండి తొణుకుతున్నాయి. సంభాషణలుకూడా శక్తివంతంగా ఉన్నాయి." ఐదేండ్లక్రితం వ్రాసిన యీ కథమీద నాకింకా అనురాగం పెంపొందు తూనేవుంది.

మానవుడు తనతోటి జీవుల్ని చూసి సానుభూతి పొందవలసినంతగా వుండడంలేదు. మనల్ని చలించే ఇది చూడండి......రాబర్టుబర్న్సు కవి పొలం దున్నుతుండగా ఒక ఎలుక కలుగుని ఆతడి నాగలి దున్నేస్తుంది. భీతిజెంది పారిపోయే ఆ ఎలుకని చూసి, పరితపించి, ఇలా అంటాడు—

I am truly sorry Man's dominion
Has broken Nature's social union,
And justifies that ill opinion
Which makes thee startle,
At me, Thy poor earth-born companion
and fellow-mortal!

ప్రకృతి మానవుడి దౌర్బల్యానికి విలపిస్తుందా? మైదానంలోని మంచుబిందువుల్ని పృచ్ఛచేస్తూ చిత్రకారుడైన ఓ మిత్రుడిలా అన్నారు?

."Perhaps the tears of mother nature that wept all over night for her neglected child."
మీకూ అలా అనాలని అనిపించడం లేదూ?

మతంపేరిట మానవత్వంకంటె మూఢఆచరణ ప్రోత్సహింపబడుతున్నది. మానవుణ్ణి ఖూనీచెయ్యమని బోధిస్తుందా మతం? టాల్స్టాయ్ మహోన్నతంగా ఒకచోట, సమీక్షిస్తూ—

"It is owned and much left for us to do upon our own hearts and temper to cultivate, to improve, to call it forth and to exercise in a steady uniform manner. This is our work, virtue and religion" అన్నాడు. రావాలి మనలో ఆ చైతన్యం!

ప్రేమలేని బ్రతుకు నిర్జీవం -

"వియోగం ప్రేమను సునిశితంచేస్తుంది.

సంయోగం ప్రేమను దృఢతరంచేస్తుంది" అంటాడు స్టీవెన్‌సన్.

బుస్సీరభూటిన్ వాక్యాలలో "వియోగం ప్రేమజ్వాలకు గాలివంటిది. ఆ జ్వాల చిన్నదైతే ఆరిపోతుంది. పెద్దదైతే మరింత జాజ్వల్యమానమౌతుంది." కలిగిందా ఆ జ్వాలమీలో? ఆ జ్వాలనుంచీ ఉద్భవించిన వైవాహికసంబంధం ఎడిసన్ తలపోసిన గొప్ప ఆకర్షణనీ, కాంతినీ యిస్తుంది.

"Marriage enlarges the scenes of our happiness and of our miseries. A marriage of love is pleasant of interest, easy and where both meet, happy - A happy marriage has in it all pleasures of friendship, all the enjoyments of sense and reason and indeed all the sweets of life.

మనలో ఎంతమందున్నారు యిలాంటి దంపతులు?

జాక్సాక్టికి కళ రూపురేఖలు దిద్దుకొన్న శాస్త్రం. హాబ్బర్టు కదో విధానం. హెన్రీ జేమ్సు కదొక మానవలోకచ్ఛాయ. ఏమైనా శాస్త్రాలన్నీ జీవితాన్ని ఒక కోణంలోంచి పరిశీలిస్తే—కళ జీవితమునుంచే ఏ శాస్త్రాన్నైనా పరిశీలిస్తుంది. అందుకే కళ మానవ బంధనాలనుంచి విముక్తిని, జీవితానికి మోక్షమునే దానిని యివ్వగల పరిశ్రమచేయగలదు.

'గీతాంజలి'లో టాగూరు, "ప్రభువు ఇప్పటికైనా ఒక నిర్ణిత ప్రదేశంలో బంధింపబడలేదని గ్రహించావా? అతడు కఠినశిలల్ని, సుందరమైన బాట నిర్మించే యత్నంలో పగలకొడుతుండే కార్మికుడి దగ్గర ఉన్నాడు. ఎండ వానలని నిర్లక్ష్యంచేసి, వారితో వినోదిస్తున్నాడు...అతడి వస్త్రాలు ధూళితో నిండివున్నాయ్!..." అనీ;-ఇంకోచోట "విముక్తా?...లోకంలో ఎక్కడుందోయి? ప్రభువే యీ సృష్టికి సర్వభారాన్ని వహించినప్పుడు... ...మనతో ఉండడానికి దీక్షాకంకణం ధరించినప్పుడు!...యీ పుష్పాల్నీ ఆడంబరాల్నీ హారతుల్నీ విడిచిరావోయి...నీ వస్త్రాలు చినిగిపోయి నంతలో పోయిందేముంది?...అతడిని కలుసుకో!......కష్టనిష్టూరాల్ని అతడితో పంచుకొని సమకాలికంగా పురోగమించు!" అనీ అన్నారు...

రండి పురోగమిద్దాం మనమూ......

ఈనా అర్పించే కథాంజలిలో విషాదాన్ని మీ రెక్కువగా ఆకళింపు చేసుకున్నట్లయితే దాని మార్పుద్వారా మీరు అన్యథా సంతృప్తిపడగల రేమోనని, ఉపసంహరించుకోవడం నా ఉద్దేశ్యం కాదు!..."ఇది సహజంగా ఉంది. మానవత్వాన్నిగురించి కొంత ఆలోచనని రేపింది అని మీరు అనుకోగలగడమే నా లక్ష్యానికి సమీపం...

"Life in its perfection is love just as truth in its perfection is beauty" అన్న విశ్వకవి ప్రవచనంతో మిమ్మల్ని సమీపించాలని నా అభిలాష. ఇలాంటి నా కృషిద్వారా మిమ్మల్ని సహ యాత్రికులుగా చేసుకోవాలనే నా వాంఛ.

పశ్చాత్తాపం మనలో కలిగింపబడాలి.

ఎందుకంటే గానం, పశ్చాత్తాపం దైవత్వాన్ని పొందించే పరికరాలు. రవీంద్రుడు ఒకచోట హృద్యమంగా "మిత్రమా!... నీ హృదయంలో మెదిలే రహస్యాన్ని దాచిపెట్టుకోబోకు. నాకు - నాకు మాత్రమే రహస్యంగా చెప్పవూ? నా హృదయం వింటుంది. చెవులు కావు...

రాత్రి చీకటి చాలా తీవ్రంగావుంది. ప్రశాంతంగావుంది గృహం... పక్షిగూట్లలో కలకలారావం వినరావడంలేదు.

సంశయపడే ఆ కన్నీటి బిందువులతో, ప్రకంపిస్తున్న ఆ చిరు నవ్వుతో, మధురమైన అవమానంతో, బాధతో, నీ హృదయంలోని రహస్యాన్ని నాకు బయలుపరచు—"అని అంతరంగిక ఆప్యాయతని వివృతం చేశారు.

నిర్మలంగా వుండటానికి అందరూ, బయలుపరచి తేలికపడాలి. లూయీ ఫిషర్, స్టాలిన్‌ని గురించివ్రాస్తూ ఒకచోట - "the seen was unreal and the real was unseen" అన్నాడు. సాధన చెయ్య బడాలి, ఆ "real"ని చూడ్డానికి—

ఆ సాధన దేనిమీద ఆధారపడింది? జీవితానికిచ్చే మనం యిచ్చుకునే వ్యాఖ్యానంమీద—ఆ వ్యాఖ్యానానికి కవితాసందేశం సాయపడుతుంది. ఎక్కడో చదివాను, "కవిత్వం ప్రకృతిలోని సౌందర్యాన్ని అభివ్యక్తం చేస్తుంది. యౌవనంలోని లావణ్యాన్ని, క్రమభావాన్ని తెస్తుంది. జీవితం మీద రక్తిమ కలిగిస్తుంది. మనలో తీరని దాహాన్ని రేపి, వసంతాన్ని వెల్లి విరియజేస్తుంది. మానవస్వభావాన్ని వ్యక్తీకరించి కనులకెదుట పెడుతుంది. భూతాన్ని అర్థంచేసుకొని, వర్తమానంలో జీవిస్తూ, భవిష్యాన్ని పాలిస్తుంది."—ఎంత ఉన్నతంగా వుంది?

మన అనుబంధాన్ని, ఓ విచిత్ర విశిష్టజీవయాత్రతో ప్రారంభిద్దాం. జీవితం మీద విశ్వాసం పోగొట్టుకొనడానికి నిరాకరించండి. షెల్లీ ధృవపరిచే

"Life may change but it may fly not
Hope may vanish, but it can die not
Truth may be vieled, but still it burneth,
Love repulsed, but it returneth." అనే, నమ్మకమూ,

మిల్టన్, ప్రవచించే

Give me the liberty to know, to utter and to argue freely according to my conscience" ఆత్మస్థైర్యమూ, మనం పొందాలి.

చివరికి "ఇంజనీరింగు కంకరరాళ్ల లో, సిమెంటులో, సాహిత్యపు గులాబీల సోయగం కలకాలం తరగకుండా పరిమళించగలదని" ఆశిస్తున్నాను. నూతన త్యాగానందాన్ని స్మరిస్తూ, ఆరాధనలో తన్మయత్వం చెందే-నేను; ఈ స్వల్ప ఆచరణని వితరణచేయగల-మీరూ; ఈ విభిన్నదారులలో ఎంత వరకూ సహకరిస్తూ పురోగమించగలమో చూడవలసివుంది......

"...నాతో రారూ..."

—ఘట్టి ఆంజనేయశర్మ

# పురోగమించిన బాట

పరిచయ వాక్యాలు వ్రాసియ్యమన్నారు ప్రకాశకులు. పరిచయం చెయ్యడమంటే, సాంపిల్ చూపించడం లాంటిది.

డాక్టర్లు కథలు రాయడం, కథకులుగా మారడం మనం వింటూ వుంటాము. రష్యన్ కథక చక్రవర్తి షెకవ్ మొట్టమొదట డాక్టరేగా, తర్వాత కథకుడయాడుగాని! అలాగే ఈనాడు సోమర్సెట్ మామ్, ఎ. జె. క్రానిన్ మొదలైనవారున్నారు. కాని, ఇంజనీర్లు కథకులవడం చాలా అరుదు. అసలు యింజనీరింగ్ వృత్తికీ, రచనావ్యాసంగానికీ చుక్కెదురు! కాని శ్రీ ఆంజనేయశర్మ ఇంజనీరైకూడా, కవితా హృదయం పదిలంగా కాపాడుకుంటున్నారనేందుకు ఈ కథలపుస్తకమే సాక్షి. ఇంజనీరులు రసగ్రహణపారీణులవలేరని కాదు నా ఉద్దేశం; వారి వృత్తిధర్మం వారిని ఊహాపథాల ఎగరనియ్యక, నేలమీదనుంచో పెట్టి, లెక్కలు కట్టమంటుంది.

ఈ రచయిత మాతృహృదయాన్ని చాలా చక్కగా చూపించగలరు. 'ఆకలి, దాహం, నిద్ర' నాగమ్మ బ్రతుకే అంత. గైలుకి గమ్యస్థాన మంటూ ఒకటి ఉందిగాని, నాగమ్మ జీవయాత్ర కదిలేదు. నాగమ్మ కామ్యకవనిత కాదు; ప్రబంధకావ్యాలు జీర్ణించుకున్న పండితురాలు కాదు; ఆమె పుట్టినప్పుడు దుందుభులు మ్రోగలేదు. వందయెకరాల పొలం వున్నప్పటికీ, భర్తమరణంతో ఆమె దిక్కులేనిది! వంటపనికి మినహా యింకెందుకూ పనికిరానిది. కాని, ఉత్కృష్టమయిన శీలానికీ—లోకం యెరగని త్యాగానికీ—ఆమె సజీవ నిదర్శనం.

మధ్యతరగతిలోని మహత్తు ఆశ్రితజీవి నాగమ్మ.

'మాతృదేవి' దీనావేదన మనసుని కదులుస్తుంది. 'కలువపువ్వుల్లాంటి కన్నులుగల మా అబ్బాయిని చూశారా!' అని పిచ్చిది, రెట్టించి

ఆడంగతూవుంటే, మనం చెదిరిపోతాము. ఈ కథని కథకులు హృదయంగమంగా చెప్పగలిగారు.

శ్రీ శర్మకి పిల్లల మనఃప్రవృత్తి, తల్లుల ఆత్మక్లేశం బాగా తెలుసు. వీరి కథలలో పిల్లలూ తల్లులూ ఎక్కువగా కనిపిస్తారు.

మానవహృదయంలోని లోతులు వెతికే మనిషి ఈయన.

కళ, శిల్పం, వాస్తవికత—యిలాంటి పెద్దవిషయాల గురించి నేను చెప్పదలుచుకోలేను. జీవితపునీడలే, కళలూ - కథలూను - ఆ నీడలమాటుకి మనని పట్టుకుపోవడమే కళాకారుని పని. ఆ కర్తవ్యం జాగర్తగా నిర్వహించారు రచయిత.

వెళ్ళండి-మీకేం తెలువరిస్తుందో, ఆమె-చూపించే వెలుగులో !—

నవంబరు '52 —చందూరు నాగేశ్వరరావు

ఆమె చూపిన వెలుగు
(భారతి)



పాషాణాల పరితాపం
(నవోదయ)

కొడుకు చదువు
(భారతి)

పసిహృదయాలు
(ఆనందవాణి)

బడిగంటలు
(భారతి)

చీకటో రోదించే బాలమూర్తి
(ఆనందవాణి)

ఆశ్రితయాత్ర
(తెలుగు స్వతంత్ర)

నాయకుడి జననం
(తెలుగు స్వతంత్ర)

మతంలేని లోకం
(ఆనందవాణి)

మాతృదేవి (భారతి)

# బడిగంటలు

బడిగంటలు ఖంగున మ్రోగాయి. చెట్టుక్రింద ఆడుకొంటున్న పిల్లలంతా తేనెతుట్టెమీద రాయి పడినట్లు ఒక్కసారి చెదిరిపోయారు. అప్పుడే పార్వతి తల వంచుకొని చదువుకొంటున్న గోపీదగ్గరకు వచ్చి "లే, గోపీ, గంటకొట్టారు" అంది. అతను మెల్లిగా లేచి, చొక్కా, లాగూ దులుపుకొని పుస్తకాలు తీసుకున్నాడు. పార్వతి చెయ్యిపట్టుకొంది. ఇద్దరూ బడివైపు పురోగమించారు.

"లెఖ్కలన్నీ చేశావా పార్వతీ?" అన్నా డతను నడుస్తూ.

"చేశాలే, కాని,....ఇవ్వాళ నాతో కలిసి బండిమీద రాలేదేం?" అంది ఆ బాల అమాయకంగా అతనివంక నింపాదిగా చూస్తూ.

గోపీ నిదానంగా చూసి "వచ్చేవాణ్ణే—" అని నగంలో ఆపి, "ఇవ్వాళ మానాన్న కూరలు తీసుకరమ్మంటే బజారుకు పోయా....ఆలస్య మయ్యే టప్పటికి మీ యింటికి రాలేకపోయాను....పా రూ...." అన్నాడు.

"ఈసారి కెలాగో అయిపోయిందికాని....ఇంకెప్పుడూ అలా చెప్పకు! నాకు తోచదు గోపీ—" అంది నిశ్చలంగా చూస్తూ....

వెనకాల సైకిల్‌బెల్ మ్రోగింది. ఇద్దరూ వెనక్కు తిరిగారు. "రాంబాబు....గోపీ...." అంది కళ్ళతో నవ్వుతూ. కాని కారుమబ్బుల్లోంచి మెరుపు మెరిసి అదృశ్యమైనట్లు ఆ బాలముఖం నల్లబడింది. గోపీ చిరునవ్వు నవ్వాడు. రాంబాబు సైకిలు దిగి, షరాయింలోంచి సెంటెండ్ కర్చీఫ్ తీసి "గోపీ, హోమ్‌వర్కు చేశావా?" అన్నాడు. అనలతనికి ఎప్పుడూ ఆ అలవాటే లేదు! గోపీ తన జీర్ణవల్కలాల్ని. మాసినపుస్తకాల్ని చూసి చిన్నబుచ్చుకున్నాడు.

"ఆ-చేశాను" అతను నిర్లక్ష్యంగా, క్లుప్తంగా అన్నాడు.

"సరేకాని, ఇవ్వాళ్టికి నీ నోటుపుస్తకం నాకివ్వు-నేను చెయ్యలేదు."

రాంబాబు దబాయింపు అతని కర్థంకాలేదు. పార్వతి ఎటో చూస్తోంది.

"పోనీ, కాపీకొట్టిస్తా-ఇట్లా పడేయ్ పుస్తకాన్ని" అన్నాడు అధికార పూర్వకంగా.

ఎవ్వరూ మాట్లాడలేదు.

"ఏం, నువ్వు తెలివికలవాడిననేనా మహా విఱ్ఱవీగుతున్నావ్?" అన్నాడు, ఏవగింపుగా.

గోపీ మాట్లాడలేదు. అసలు మాట్లాడకూడ దనుకున్నాడు.

"పారూ, పోనీ నువ్వన్నా ఇవ్వవూ ?"

పార్వతి అయిష్టంతో చూసింది.

అతనికి కోపం వచ్చింది. "అవునులే....ఎందుకిస్తావ్? వాడి స్నేహం చేసి....తా జెడ్డ కోతి....చింకిగుడ్డల వెధవాయ్...." అన్నాడు వుడుకు మోత్తనం పట్టలేక. అతను వేటకాడిలా బాణాల్ని వదులుతున్నాడు.

గోపీ "నేనేంచేశాను?" అన్నట్లు చూసి, తల వంచుకొని వెళ్ళి పోయాడు. తనవలన పార్వతికికూడ నింద యెందుకు? "గోపీ-గోపీ" పార్వతి లేడిలా పరుగెత్తింది. రాంబాబు విషాదంగా నవ్వి "పారూ, పోబోకు - మంచి రోజాపువ్వు నీకు" అని జేబులోంచి తీశాడు. పార్వతి "డైలమా"లో పడింది! గోపీకి తనమీద కోపం వచ్చిందేమో! అప్పుడే అతను కనుచూపుమేర దాటి క్లాసులోకి పోయాడు. బాబుదగ్గరకు వచ్చి "వాడు పోతే అంత ఖంగా రెందుకు? పారూ, మన దర్జా వాడికేం వుంది?" అంటూ తల్లో పువ్వు పొదివాడు. అత నేంచేస్తున్నాడో తనకు తెలియదు. నాగస్వరానికి పాము నిశ్చేష్టయిపోయినట్లు, తనూ చేతనాచేతనాలన్నీ మరిచి నివ్వెరపోయినట్లుంది. అత నంగీకారంగా భావించుకొని "మా ఇంటికొస్తె పెద్ద ప్రెజెంట్ నీకు. మా నాన్నగారికి నువ్వంటే చాలా ఇష్టం. వస్తావుకదూ?" అంటూ నడిచాడు. పార్వతి ఈ ప్రపంచంలోకి వచ్చినట్లయి అతన్ని విచిత్రంగా చూసింది. అత నేంచేశాడు? తనతల్లో పువ్వుపెట్టాడు! కాని గోపీ అంటే అంత ద్వేషం యెందుకు? పాపం, అతని హృదయం ఎలా బాధపడివుంటుందో! తనతో ఆడుకోడు కాబోలు. తన ఇంటికిరాడుకూడా నేమో! పార్వతి కన్నుల నీరు నింపుకొంది. ఎందుకూ బాధ? తను గోపీకి

అకారణంగా దూరమయిపోతుందా? రాంబాబు గొప్పేమిటి? భాగ్యవంతులు కానివారు మర్యాదకూ, గౌరవానికీ లోకువా ? బాబు చూసి చూసి, అనున యంగా పార్వతి చెయ్యిపట్టుకొని "ఏమిటీ ఆలోచిస్తున్నావ్? నీకేం తెలీదు. బలెపిచ్చిదానివి-రా నేచెప్తా" అన్నాడు. పార్వతి అతన్ని ద్వేషించకపోయినా ఇష్టంలేదు. మందగమనాలతో క్లాసులోకి పోయారు.

* * *

వారంరోజులైంది. గోపీ పార్వతిని తప్పించుక తిరుగుతున్నాడు. ఎవ్వరితోనూ విస్తారంగా మెదలక తనపని తాను చూసుకవస్తున్నాడు, ఆవేళ గంటకొట్టగానే ఇంటిదోవ పట్టాడు. బండిమీద పోతున్న పార్వతి దృష్టిని తప్పించుకోలేకపోయాడు. " గోపీ - గోపీ - " అంటూ కోయిలలా పిలిచింది. గోపీ ఆగక తప్పిందికాదు. ఛటుక్కున బండిదిగి " నేనేం చేశాను ? నామీదెందుకు కోపం ?" అంది. అతను సమాధానపూర్వకంగా ఆబాలకళ్లల్లోకి చూశాడు. నోటినుంచి మాట తెమలక " నాతో మాట్లాడ కుండా—మా ఇంటికి రాకుండా:....నువ్వు ' అని కళ్లు తుడుచుకుంది. కాని అత నిదివరకే భాగ్యవంతుల పిల్లలతో స్నేహం చెయ్యకూడ దను కున్నాడు. కాని ఆ బిగువంతా ఆ నిర్మలస్నిగ్ధలావణ్యమూర్తి అశ్రుధారల్లో కరిగిపోయింది. " పారూ " అన్నాడు ప్రశాంతంగా. ఆ బాలకు తన మనోగతాభిప్రాయాలు తెలియకూడదని అతని అభిమతం. " దా-మా ఇంటికిపోదాం " అంది. "వస్తాపారూ - నా కెందుకు కోపం ? బీదవాళ్లకి కోపం వుండరాదుకదూ ? " అన్నాడు. పార్వతి మాట్లాడకుండా అతని చెయ్యి పుచ్చుకొని బండిదగ్గరకు పోయింది. గోపీ కళ్లల్లో తన "చింకిగుడ్డల రూపం" అగుపడింది. తను నిర్దోషినని తెలుసు. అందరూ తన తెలివిని చూచి చాటుగా ఈర్ష్యపొందుతారని తెలుసుకున్నాడు. స్నేహానికి హుందా, గౌరవం, ధనం వుండాలా ? అతడు తటపటాయిస్తున్నాడు. పార్వతి భాగ్యవంతుల పిల్లఅయినా చాలా అమాయకురాలు ! అతనికి తెలుసు.... ఆమె....నిర్దోషి....బండెక్కబోతున్నాడు. అప్పుడే కారు వారి ముందు ఆగటంతో ఇద్దరూ విభ్రాంతులైనారు. రాంబాబు చిరునవ్వుతో కారులో నుంచి దిగి " ఓహో....పార్వతి....ఇక్కడున్నావా ? " అన్నాడు.

పార్వతి గోపీ చెయ్యివదిలింది. అతనివంక కోరచూపులు చూస్తూ "నీ కోసం ఎంత వెతికాను! - ఇవ్వాళ మా ఇంట్లో టీపార్టీ కూడాను. మా నాన్న గారు నిన్నుగురించి అడిగారు. రా-పార్వతీ" అన్నాడు. "బాధించక" అన్నట్లు చూసింది పార్వతి.

"గోపీకూడానా ?" అంది అప్రయత్నంగా. గోపీమెదళ్లో ఆత్మాభిమానం చావలేదు. హీనస్వరంతో "నేను పోతా-మానాన్న కోప్పడతాడు" అన్నాడు పోబోతుండగా పార్వతి ఆపి, బండిలో కూర్చునేవరకూ బలవంతంచేసింది. "నేను రాను" అని చెప్పి తనూ బండిలో కూర్చుంది. పాముకాటు తప్పినట్లు రాంబాబు బాధపడ్డాడు. పార్వతి ఆ అనాగరికగొడ్డుమీదున్న అభిమానం తనమీదలేదు. అతనికి గోపీపై చెడ్డకోపం వచ్చింది. ఈసారి గోపీకి దేహశుద్ధిచేస్తేగాని తనకు సంతృప్తి కలగదు. దహించుకపోతున్న హృదయంతో కారెక్కాడు.

* * *

పార్వతి మర్నాడు మామూలుప్రకారం గోపీ తనతో రాకపోతే కాచుకునే మఱ్ఱిచెట్టుదగ్గిరికి వచ్చింది. అతను లేడు ! గోపీ కూర్చుండేచోటుదగ్గర కొన్ని పుల్లలు పడివున్నాయ్. పిట్ట అరుస్తూ వుంది. ఎవరో గూడిని పడ గొడితే గూడు చెట్టునుంచీ పడిస పుల్లలవి. మగపావురం దెబ్బ తిని పడుంటే గువ్వ రోదిస్తూంది. కాసేపు పార్వతి దానివంక చూసి క్లాసులోకి వచ్చింది. పిల్లలంతా తలోవిధంగా చెప్పుకుంటున్నారు. గోపీని రాంబాబు చీకట్లో కొట్టాడని కొందరూ, నౌకరుచేత తన్నించాడని కొందరూ అనుకుం టున్నారు. ఆ అమ్మాయి విభ్రాంత అయింది. ఏడుస్తూ ఇంటికిపోయి ఓమూల కూర్చొంది. అన్నం తినలేదు ! తనకు తెలుసు పిరికి రాంబాబు కొట్టలేడని ! కాగా ఏ నౌకరుచేతనో చీకట్లో, నిస్సహాయస్థితిలో కొట్టించి వుంటాడు ! ఆ చిన్నహృదయం గాలిలోని ఆకులా రెపరెపలాడింది.

* * *

మర్నాడు గోపీకి జ్వరం వచ్చే చిహ్నాలు అవుపించినాయి ! తనని నిర్దయగా కొట్టించిం దెవరో దెలియకపోలేదు. ఎలాగో బడికి వెళ్లాడు ప్రయాసతో. ఎప్పుడూ అనుకోని విషయం జరిగింది. హెడ్మాస్టరు తన్ను పిలిపించి

తూలనాడటంతో మతిహీనుడైనాడు. రాంబాబు తన్ను కొట్టించి, తనను కొట్టించినట్లు ఫిర్యాదుచేశాడు. తను బడికిరాకపోవటం కారణం సాకుగా చూపాడు. అవును. భాగ్యవంతుడి బిడ్డకు కొదవేమిటి? హెడ్‌మాస్టరు తనని పదిహేనురోజులు సస్పెండుచేసి, పదిరూపాయలు జుల్మానా విధించాడు. తనేం చెబుతాడు? చెప్పినవన్నీ చెవిటవానివద్ద శంఖం వూదినట్లు భావించబడింది! వణికిపోతూ ఇంటికివచ్చి తండ్రితో కన్నీరు కారుస్తూ చెప్పాడు. తండ్రి పదిరూపాయలు చెల్లించలేని అసహాయస్థితిలో వున్నాడని తనకి తెలుసు! గత్యంతరం లేకపోయిం దతనికి. ఎప్పుడూ తన చిన్నకోర్కెల్ని తండ్రి హీనస్థితిలో పోల్చి, చంపుకునేవాడు!

తండ్రి సానుభూతి వహిస్తా డనుకొన్నాడు. కాని ఆయన కోపంతో ప్రకంపించి "గాడిదా - ఎంతపనిచేశావ్! - ఇంత వెధవవి వున్నావో లేదో ఎంత పౌరుషం!" అంటూ వెఱ్ఱిగా బాదాడు. గోపీకి దేహం పచ్చిపుండైంది. "తల్లిలేని విధవవి! - నీకోసం పెళ్ళిచేసుకోకుండా కష్టపడుతుంటే జరిమానాలు చెల్లించడంకూడానా?" అంటూ దూషించాడు. గోపీకి ఆ నీరసస్థిలో ఆలోచించి సమాధానం చెప్పే పరిజ్ఞానంకూడా పోయింది. తండ్రి మొన్న మొన్నటివరకూ గుమాస్తాపనిచేసి ఆత్మగౌరవాన్ని అమ్ము కున్నవాడు! తన పసిహృదయం ఇంకా అంత పరిపక్వానికి రాలేదు! అది దోషమా? ఇదంతా ఓ బూటకంలాగుం దతనికి! - నిజం మాట్లాడా లని పుస్తకాల్లో చదివాడు. ఆచరణంలోకి వస్తే అంతా తారుమారే! హింస పనికిరాదని ఉపాధ్యాయుడు బోధిస్తాడు. కాని చేసేదీ, జరిగేదీ హింసకాక మరేమిటి? గోపీ సాయింత్రంవరకూ అలాగే పడుకున్నాడు. తన్నెవ్వరూ భోజనంచెయ్యి మనలేదు! తన స్థితీ, రాంబాబు స్థితీ చూచుకొనే టప్పటికిఅప్రయత్నంగా కన్నుల నీరు నిండింది. అతడు ప్రపంచానికి ఓ తృణప్రాయం!

రాత్రికి జ్వరం వచ్చింది. అక్కడినుంచి లేవలేకపోయాడు. క్రమంగా తండ్రికి కోపం తగ్గి కొడుకును చూసి కూలబడిపోయాడు. మెల్లిగా మంచంమీద పడుకోబెట్టి ఒళ్లుపట్టాడు. వైద్యుణ్ణి పిలుచుకువచ్చి మందిప్పించాడు.

పార్వతి గోపీ రాకపోవటం చూసి బెంగపెట్టుకుంది. రాంబాబును నిలవ దీసి అడిగింది: అతడు దొంగలా ఆ ప్రసక్తి తనవద్ద తేవద్దన్నాడు ! - నాలుగోరోజున తండ్రితో చెప్పకుండా గోపీఇంటికి వచ్చింది. గోపీ జ్వరం మిన్నుముట్టింది. అతడు గుర్తుపట్టే స్థితిలో లేడు. పార్వతి తిరిగివచ్చింది.

ఆ రాత్రి నూటఅయిదువరకూ టెంపరేచర్ వచ్చింది. ఒక్కటే పిచ్చిమాటలు -"నాన్నా, బడిగంటలు కొట్టారు - పుస్తకా లివ్వు-పోతా-" అంటూ లేవబొయ్యేవాడు. "నాన్నా - లెఖ్ఖల్లో నాది ఫస్టుమార్కు, ఇంగ్లీషులోనూ నాదే - అసలు అన్నీ నావే నాన్నా ! - " అంటూ అలమ టించేవాడు. తండ్రి దిగాలు పడిపోయాడు. తన అనాలోచితప్పనికి ఎటువంటి శిక్ష శిధించబడుతుందోనని. "నాయనా, నిన్ను కొట్టిన ఈ చేతులు చేతులు కావు - రాళ్లు - హంతకుణ్ణి" అని రోదించేవాడు. చేతులు కాలింతర్వాత ఆకులు పట్టుకోడం !

తెల్లవారు గట్ల గోపీ ఆయాసంతో మంచంకేసి తలను కొట్టుకున్నాడు. చూపు వెఱ్ఱిచూపుగా మారింది! తండ్రి దుఃఖాన్ని దిగమింగుకుంటూ కాస్త పండ్లరసం గొంతులోపోసి, ప్రక్కనద్ది అనునయించాడు. గోపీ కళ్లు మూయంగానే వైద్యుడివద్దకు పరిగెత్తాడు. రాంబాబు గోపీనిగురించి విని చాలా భయపడ్డాడు. జాలిపడ్డాడుకూడా. దారిలో "ఎలావుం"దని తండ్రి నడిగాడు. నమాధానం రాక. గోపీస్థితిని వూహించుకున్నాడు. తను ఎంతపని చేశాడు ? గోపీకి జీవితాశ వుందా ? అతను పరితప్తహృదయంతో పార్వతి ఇంటికి వెళ్ళాడు. ఆ బాల ఏడుస్తూ పుస్తకంమీద పిచ్చిగీతలు గీస్తాంది. బాబుని చూడటంతోనే ఆమె ముకుళించుకుపోయింది. అతడు ప్రాధెయ పూర్వకంగా "క్షమించు - ఒక్కసారి గోపిని చూద్దాం రా" అన్నాడు. ఇద్దరూ వెళ్ళారు.

ఆయానంతో, ఆత్రతతో చూసే తండ్రినీ, జాగ్రత్తగా పైకి ఎటువంటి భావాన్ని వ్యక్తపరచని వైద్యుణ్ణీ చూసి పార్వతి పెద్దగా యేడ్చింది. ఏడుస్తూనే గోపీ కాళ్ళదగ్గర కూర్చొని "గోపీ - నన్నొకసారి చూడు. నాకది చాలు" అంది. రాంబాబు దీనంగా "గోపీ - నన్ను క్షమించు గోపీ. నీ కాళ్లు పట్టుకుంటా" నన్నాడు. తండ్రి గద్గదస్వరంతో చేతులు పైకెత్తి

"నా ప్రాణాన్నైనా తీసుకుని నా కొడుకును బ్రతికించు తండ్రీ" అని ప్రార్థిస్తున్నాడు. పంజరంలోని పిట్టలాగా కుమిలిపోయాడు.

వైద్యుడు పెదవివిరిచి, స్టెతస్కోపు తీసేసి నిట్టూర్పు విడిచాడు. గోపీ కళ్లు తెరిచాడు. అందరివంకా చూశాడు. అర్థంచేసుకొన్నారో లేదోకాని! - లేవడానికి ప్రయత్నించి విఫలుడైనాడు. చివరకు కళ్లు మూసుకొని, తల ప్రక్కకుత్రిప్పి ఎవ్వరివంకా చూడకుండా "నిర్దోషిని - నాన్నా, గంటలు వినిపిస్తున్నాయ్ - బడికి పోతున్నాను - ఇదిగో" అన్నాడు.

బడిగంటలు యధాప్రకారంగా ఖంగున మ్రోగాయ్. ప్రకృతి విషాద స్వరంతో విలపించింది........



# పసి హృదయాలు

విశూని అంతగా ఎందుకు ప్రేమించేవాడినో అని అనుకున్నప్పుడల్లా చాల అశ్చర్యపడుతూ వుంటా.

పద్దెనిమిది సంవత్సరాల క్రిందటి మాట. నాకు బాగా జ్ఞాపకం. ఇద్దరం ఒక వీధిలో ప్రక్క ప్రక్క ఇళ్ళలో వుండేవాళ్ళం. నే నెప్పుడూ ఎరమరిక లేకుండా వాళ్ళింట్లో వాళ్ళ అబ్బాయిలాగు తిరుగుతుండేవాడ్ని. మాలో మేం. చాలసార్లు పోట్లాడుకోవడం మళ్లా గంటలో కలిసి గెంతడం మామూలే చాలాసార్లు మా అమ్మ పిలిచినా వాళ్ళింట్లోనే భోంజేసి ఒక ప్రక్కనే నిద్రపోయేవాళ్ళం. చాలమంది అన్నదమ్ములా అనేవాళ్లు....

విశూ వాళ్ళది పెద్ద బంగళా....అందుట్లో జమీందారు కొడుకు.... అయినా మా కా భేదాల్ని ఎన్నడూ ఉన్నవని అనుకునేవాళ్ళంకాదు. వాళ్ళమ్మకూడా చాల దయతో వుండేది.

విశూకి పుట్టింరోజు పండగ అయిన తర్వాత నాతో సరిగా మాట్లాడడం, కలిసి తిరగడం మానేశాడు....నేను చాలసార్లు ఎంత అనునయంగా ప్రవర్తించినా అతడు తప్పుకొని, తప్పుకొని తిరిగేవాడు. నా కతని ప్రవర్తన చాలరోజులవరకు అవగాహన కాలేదు. ఒకనాడు చూచాయిగా మా అమ్మని అడిగాను. "విశూ గొప్పవాళ్ల అబ్బాయ్‌రా...." అంటూ పని చూసుకుంది. నాన్న నడిగితే "పో వెధవాయ్....నీకు వాడికి పొత్తేమిటి ?".... అన్నాడు. ఇప్పు డనుకుంటున్నాను ! నేను "వెధవ" నవడానికి అయన కదొక కారణం అయిందా అని....? విశూఇంటికి జంకుతూ పోయాను. ఆనాడు. వాళ్ళ నాన్న పురుగును చూసినట్లు నన్నుచూసి "ఎందుకొచ్చావ్?...." అన్నాడు. వెనక్కు తిరిగి పోతుండగా వాళ్ళమ్మ పిలిచి "ఏమనుకోబోకు నాయనా....ఆయన దుడుకుమనిషిగాని...." అంది, కాలు కాలిన పిల్లిలా వెళ్ళిపోయాను.

ఓనాడు తోటలో జామకాయలు చెట్టెక్కికోస్తుంటే విశు వచ్చి నావంక ఆశగా చూశాడు. పాపం....విశూ చెట్టెక్కలేడు !....నేను క్రిందికి దిగివచ్చి

వాడికి మాట్లాడకుండా రెండుకాయ లిచ్చాను. వాడు భయపడుతూ చుట్టూరా చూసి తిన్నాడు. నేను వాడివంక చాలసేపు చూసి వెళ్లిపోతుంటే పెద్దగా ఏడ్చాడు.

"ఎందుకమ్మా....విశూ....అలా ఏడుస్తావ్?" అనునయంగా నా చొక్కాతో వాడి కళ్లు తుడిచాను. చాలసేపటికి "నామీద కోపం లేదు కద?" అన్నాడు.

"ఎందుకు?" అన్నాను.

"అదికాదు. మా నాన్న చెప్పాడు, నువ్వు చాల చెడ్డవాడి విట. నీతో స్నేహం చేస్తే చదువురాదట....నువ్వు మంచివాడివి కాదుట....అందుకని నీతో తిరిగితే, కొడతాడట...."

నేను ఏం చెప్పాలో తోచక, "ఇంకా....!" అన్నాను.

"నీ అంత మంచివాడు లేడు బుజ్జీ....నువ్వు కష్టపడి కోసిన జామ కాయలు నాకిచ్చావు....నాతో ఇంక బాగా మాట్లాడుతావుకదూ!...."

"మీ నాన్న....' అన్నాను.

"కాదు, బుజ్జీ....ఎవరు చెప్పినా వినను...." జట్టాపట్టా లేసుకొని వెళ్ళి పోయాం. తర్వాత, మా స్నేహం విడిపోలేదు. వాళ్ళనాన్న ఎందుకలా అన్నాడో మా కప్పుడు అర్థం కాలేదు.

* * *

అది అలా జరిగిపోయింది. మొన్న విశూని సినిమానుంచి వస్తుండగా చూశాను. ప్రక్కన ఓ అందమైన అమ్మాయికూడా వుంది. చూసి చాల రోజులయింది. ఎంతగా మారిపోయాడు....పెళ్ళయింది కాబోలు!....

ద్విగుణీకృత ఉత్సాహంతో గట్టిగా "విశూ" అని పిలిచాను.

మెల్లిగా తల త్రిప్పి నన్నుచూసి అతికష్టంమీద చిన్న చిరునవ్వు నవ్వాడు....

"ఓహో....మీరా" అన్నాడు ఆ పాదమస్తకమూ చూస్తూ!....

చెంపపై కొట్టి నట్లనిపించింది. "నువ్వేనా నేను కలలుకన్న విశూవు ?"....మనస్సులో మెదిలింది.

"ఏం చేస్తున్నావ్ ?" అన్నాడు పరధ్యానంగా....ఏదో చెప్పి వెళ్ళి పోయాను. తను ఇప్పుడు అసిస్టెంట్ ఇంజనీరుగా వుంటున్నాడని చేప్పాడు.

*　　*　　*

మర్నాడు బీచిలో ఆ అమ్మాయిని, విశూని, మా చీఫ్ ఇంజనీరుని చూశాను. వాళ్ళ నవ్వులు సముద్రపు హోరులో కలిసిపోయాయి.

ప్రక్కగా పోతుంటే విశూను అంటున్నాడు: "మీ పరిచయభాగ్యం కలగటం మా అదృష్టం. మా ఇంట్లో ఈ రాత్రికి విందారగించాలని మా హృదయపూర్వక ప్రార్థన...."

*　　*　　*

విశూ నాకోసం ఒకప్పుడు ఏడిచాడు. ఇప్పు డతనికోసం నేను పరితాప పడుతున్నాను. దేవుడు ఎక్కడన్నా వుంటే ఒక్క విషయాన్ని అర్థించ దలచాను. "ప్రభూ....పసిహృదయాల్ని లోకం దృష్టిలో పరిపక్వానికి రానీబోకు...."



# కొడుకు చదువు

నారాయణరావు దృష్టికి లోకాలన్నీ ప్రచండవేగంతో తన చుట్టూ గిర్రున తిరుగుసట్లు అగుపించింది. నిలువునా తన దేహాన్ని నరికినా నొప్పిగలిగేదికాదు. లేకపోతే పరిక్షలన్నీ దిగ్విజయంగా నెట్టిస్తూ ఉత్తముడనీ, తెలివిగలవాడనీ పేరుపొంది, కలలోకూడా అనుకోకుండా తన నెంబరు కనిపించకపోయేటప్పటికి కుప్పలాగా నుంచున్నచోటనే కూలిపోయాడు....మొదటినుంచీ అశ్రద్ధగా తిరిగినా, ఒకవేళ దురదృష్ట వశాత్తు పేపర్లన్నీ పాడుచేసినా అంత ఆందోళనా, బాధా వుండేవి కావు. తన శక్తిని. కాలాన్ని. ధనాన్ని కేంద్రీకరించి, ఏకాగ్రతతో సంవత్సరం మొదటినుంచి పరీక్షదాటి బయటపడదామనే ప్రయత్నించాడు. తనకు ఆర్థికంగా. సాంఘికంగా విలువ ఎంత వుందో బాగా తెలుసు.

పొద్దస్తమానమూ దగ్గుకుంటూ, నడవలేక నడవలేక కోమటిగుమస్తా ఉద్యోగాన్ని, నలభయిరూపాయల కోసం....తన కోసం....తను పెద్దవాడై ఏదో కొండంత పేరుప్రతిష్ఠలు తెచ్చుకొని తన్నుద్ధరిస్తానని....చేస్తున్నాడు తండ్రి........

ప్రతిజాబులోనూ "జాగ్రత్తగా చదువుకో, క్లుప్తంగా వాడుకో, ఎంత ప్రయత్నించినా ఇంతకంటే ఎక్కువ పంపలేకుండావున్నా" అంటూ వ్రాసే వాడు. అప్పుడు అతని దీనమైన కండ్లు........అసహాయతను కనపరుస్తూ తన మనఃపథంలో మెరిసేవి !........

తల్లి....తన చదువుకోసం....రెండు చీరెలతోనే సంవత్సరమంతా వెళ్ళ బుచ్చడం ఎలా మరిచిపోతాడు ?........

పిల్లలంతా మూగి తల్లిని ఏదన్నా కొనిపెట్టమని వేధిస్తే "అన్నయ్యా పెద్ద వాడై, ఇన్ని రూపాయలు సంపాదించి, మీ రడిగినవన్నీ కాక....ఇంకా గంపెడు వస్తువుల్ని కొనిపెడతాడు" అనేది. ప్రతీరాత్రి నిద్రపోయేటప్పుడు "స్వామీ, మమ్మల్ని ఉద్ధరించు........మా అబ్బాయి వృద్ధిలోకి రావాలి,

తండ్రి !........అని ప్రార్థిస్తూ అంటుండడం ఎన్నోసార్లు విన్నాడు. ఇది తెలిసి ఎంత పరితపిస్తుందోకదా !........ఏం లాభం ?........తన శ్రమంతా బూడిదలోపోసిన పన్నీరులా భవిష్యత్తునంతా అంధకారమయాన్ని చేసింది. ప్రతివారం వారఫలాలు చూసేవాడు. ఈవారం "శుభవార్తాశ్రవణం" అని వుంది. ఇవేవీ చేయని, తన గదికి ఎదురుగావున్న సాయెబు కుఱ్ఱాడు ఏమీ చదివేవాడు కాదు. పరీక్షలయింతర్వాతకూడా "నువ్వు మక్కాకు పోవడం ఎంతో నేను ప్యాసవటం అంతే" నన్నాడు.

ఎదురుగా, కాకితంమీద అచ్చయిన అతడి నెంబరు తనను వెక్కిరిస్తోంది! ఒక్క అతడిమాటే ఏమిటి?........చదవని, శుంఠల్లాగా తిరిగే తన మిత్రుల నెంబర్లు ఎన్నో వున్నాయే !—కాని....సర్వస్వాన్నీ, విశుద్ధహృదయంతో, నెగ్గి బయటపడడానికోసం అర్పించిన తన నెంబరులేదు !....లేదు ముమ్మాటికీ !........ఈ స్థితిలో తను కాలుకదల్చగలడా ? ఒక్కఅడుగు ఇంటివైపు ఎట్లా వేస్తాడు ? ఆత్రుతతో తనవంకచూసే ఆ అభాగ్యుల నేత్రాలు తనను వేటాడవా ? ఏం చేస్తాడు ?........

తన చేతిలో ఏముందిగనుక !........ఒక్కసారి చుట్టూ చూశాడు ! బజారు. మనుష్యులు ఎవ్వరూ అగుపడలేదు.

"నువ్వు తప్పావా ?........"

"ఎంత దురదృష్టమోయ్ !"

"నే నెప్పుడూ అనుకోలేదు !........"

"అనుకోకుండానే ప్యాసయినదానికంటే నువ్వు తప్పావంటే పిచ్చెత్తుతుందోయ్ !...."

ఇంక అతడు వినదలుచుకోలేదు. పరిగెత్తాడు. మనుష్యులు, శబ్దం, గుఱ్ఱపుబండ్లు, సోడాకేకలు—ఇవన్నీ వినపడకుండా...............అలుపు వచ్చి ఆగాడు.

"ఎక్కడికి ?........" అంది అంతరాత్మ.

"చావడానికి........"

"చస్తావా ?........"

"బ్రతికి భరించలేను........"

"నీకోసం బ్రతికే అమ్మని, నాన్నని, చెల్లెళ్ళని, తమ్ముళ్ళని.... వదిలిపెట్టి ?...."

నారాయణరావు ఆలోచనతో సతమతమై, వూరంతా తిరిగాడు. మనశ్శాంతి కలుగుతుందేమోనని దేవాలయంలోకి వెళ్ళాడు. "తండ్రీ....నన్ను మరి చావా....దయామయు డంటారుకదూ నిన్ను?"....వెక్కి వెక్కి ఏడ్చాడు. దేవుడుగూడ భాగ్యవంతులమాట వింటాడు!....తనకు—ఈ లోకంలో, స్వార్థంతో సాముచేసే ఈ లోకంలో స్థానంలేదు.

పొద్దున్నే బజారు బయలుదేరినవాడు జాము పొద్దెక్కినా ఇంటికి వెళ్ళలేదు.

ఏదో జ్ఞాపకం వచ్చినవాడల్లె లేచి ఇంటికి బయలుదేరాడు.

ఇల్లు సమీపిస్తుంటే కాళ్ళువణకడం మొదలెట్టాయ్....గొంతులో ఏదో అడ్డం పడ్డట్టయింది....ఎదురుగా వుండే వస్తువులు కెలికినట్లు అగుపించాయ్.

ఇంట్లో బలవంతాన అడుగుపెడుతూనే పక్కింటి గడియారం నీరసంగా నాలుగు కొట్టడం విన్నాడు. ఎంతో నీరసం తన్నావహించింది........

తండ్రిచేతిలో పేపరుంది. తనను చూశాడు.

"ఏరా........ ఇంతసేపటీనుంచీ ఎక్కడ వున్నావు?"—ఊపుతూ అన్నాడు.

మాట్లాడలేదు...... అసలు మాట్లాడలేకపోయాడు.

"నీ నెంబరు అగుపించలేదని రంగయ్యబ్బాయ్ చెప్పాడు"

తలొంచుకొన్నాడు. కన్నీటిబొట్లు రెండు జారాయ్.

"అయితే తప్పినట్లేనా!......." కోపంతో వణుకుతూ చెంపమీద వేళ్ళు తేలేటట్లు కొట్టాడు.

నారాయణరావు తూలిపడ్డాడు. తనను కొట్టాడ ఏం చింతలేదు! ఆ కృశించే తండ్రిహృదయానికి కష్టం తెచ్చిపెట్టానే అన్నబాధే పీడిస్తోంది.

తండ్రి ఉపన్యాసధోరణిలో అంటున్నాడు.

"అవును........చదువు అందరికీ ఎలా అబ్బుతుంది? జులాయిగా తిరుగుతూ. కబుర్లతో. దమ్మిడీ విలువచెయ్యని చెత్తకథలు వ్రాస్తూ చెడ తిరుగుతూ.........."

చాలామాటలు వినిపించలేదు. వినిపించినమాటలు శూలాల్లాగా దూసుకుపోతున్నాయ్.

ఎంతసేపు అలా సొమ్మసిల్లి పడుకున్నాడోగాని. కళ్ళుతెరిచి చూసేటప్పటికి ఎవ్వరూ లేరు.

మృదుహస్తం తనను తట్టిలేపుతోంది.

"అమ్మా......."

"నాయనా"........లే, భోంచేద్దుగాని........

"నేను భోంచేయగల సనుకున్నావా అమ్మా?....నా శక్తిని, తెలివితేటల్ని ఉపయోగించి చదివినాను...వృధా!.."

పెద్దగా ఏడ్చాడు.

"మాతండ్రివికదూ?........ఎప్పటికైనా మంచి రోజులు రాకపోవు....లే, నాన్నా!...."

తండ్రి గదిలోంచి బయటికి వచ్చి గద్దించాడు.

"ఇంకా ఏమొహంపెట్టుకు అన్నం తింటావు?....నూటికిలేదు; మీసాలకు సంపెంఎనూనెట!....ఏమిటో ఈ గారాబం!........"

తల్లి వణికిపోయింది. శోకమూర్తిలా నుంచొంది బేలగా చూస్తూ!........

"నాన్నా..........మీ కెందు కీబాధ?...........పోతున్నా" అన్నాడు నారాయణరావు.

"పో....గంగలో కలు... ఏమిటోయ్ ఆ బెదరింపులు?" అన్నాడు తండ్రి.

నారాయణరావు పోబోతుంటే తల్లి అడ్డం వచ్చింది. "పోనీ....ఎక్కడికి పోతాడో చూదాం...."

తల్లిని కదలకుండా పట్టుకున్నాడు. నారాయణరావు కృతజ్ఞతాపూర్వకంగా, జాలిగా చూసి వెళ్లిపోయాడు.

"మళ్లీ రాకపోతాడా....ఎక్కడికి పోతాడు నన్నొదిలి!...." అనుకుంది తల్లి విధిలేక....పోయిన దిక్కే కృశించిపోతూ చూసింది. "తప్పటం ఘోర" మనుకుంది.

తండ్రి పెద్దగా నిట్టూర్చాడు గదికి పోతూ....

* * *

క్రమంగా, తండ్రి తేరుకున్నాడు. ఎక్కడికి పోయాడో పిల్లాడని ఆలోచించడం మొదలెట్టాడు. భోంజనంచేయలేదని జ్ఞాపకం వచ్చింది.

"ఎక్కడి కెళ్లాడో........పిచ్చినాయన...." అంది తల్లి.

"తీసుకొస్తా, వుండు.... ...ఎక్కడికి పోగలడు కనుక........" అంటూ చొక్కాతొడుక్కోబోతుండగా పోస్టుబంట్రోతు లోపలికివచ్చి టెలిగ్రాం యిచ్చిపోయాడు.

గాభరాగా విప్పి చదివాడు....మొఖం విప్పారింది.

"ఏమేవ్........అబ్బాయి ప్యాసయినాడని....పొరపాటున నెంబరు పడలేదని వార్త వచ్చింది...."

సంతోషంతో ఇల్లంతా తిరుగుతూ అందరికీ చెప్పాడు. తల్లి కన్నీరు కార్చింది........కాదు, ఆనందబాష్పాలు!........

"మా నాయనా....నాయన" అంది మాతృహృదయంద్రవించగా.

"అవును, మా నాయన...........ప్రజ్ఞాశాలి" అన్నాడు ఆవేశంతో.

"తీసుకొస్తా"....తండ్రి ఆగలేక చొక్కాయైనా లేకుండానే వీధిని పడ్డాడు. వూరంతా తిరిగాడు. అగపడినవారందరితోనూ చెప్పాడు. గుళ్లల్లో, సత్రాల్లో, రైల్వేస్టేషనుదగ్గర, అరుగులమీద అన్నీ వెతికాడు.

మనుషుల్ని అన్నివైపులకూ పంపించాడు. తనూ కాలవవైపు బయలు దేరాడు పెద్దగా పేరుపెట్టి పిలుచుకుంటూ.

"అబ్బాయ్.......ప్యానయినావు....ఎక్కడున్నావ్?" ఇలా నిమిషనిమి షానికీ అరుస్తూనేవున్నాడు. దూరంగా చెట్టుకింద ఎవరో పిల్లాడు కూచున్నట్లు అగుపడ్డాడు.

తను అలా గట్టిగా పిలుస్తూనే పరిగెత్తుతున్నాడు. వాడు మెల్లిగా లేచి కాలవవైపు నడవడం ప్రారంభించాడు. ఇద్దరిమధ్య ఫర్లాంగుదూర ముంటుంది. శక్తినంతా కూడగట్టుకొని పరుగెత్తడం ప్రారంభించాడు.

క్రమంగా పిల్లాడు నీటిలో కాలుబెట్టాడు.

ఎంత అరిచినా వినిపించడం లేదుగావును.

అలా పోతూనేవున్నాడు వాడు.

తీరా, తను దగ్గరికి వెళ్ళేటప్పటికి గొంతువరకూ మునిగాడు. తల చూసి గుర్తుపట్టాడు!....నారాయణరావు!

"నువ్వు ప్యానయావురా, నాయనా, ఇదిగో చూడు. బెల్లగం.... ..." చేయెత్తి చూపించాడు.

సంతోషంతో నవ్వి "కాళ్లు తేలిపోతున్నాయ్, నాన్నా........" మాట్లాడలేక పోయాడు.

తండ్రి ఛెంగున నీటిలోకి దూకాడు. నారాయణరావు ప్రవాహానికి కొట్టుకు పోతున్నాడు—తనమీద ఆశపెట్టుకున్న అంపర్ని విడిచి........



# పాషాణాల పరితాపం

నవ్వుతూ, నిర్భీతిగా నవ్వుతుండే విద్యార్థులమధ్య, నేను చాల విపరీతంగా అగుపడ్డాను. బస్సుదగ్గరకు ఆలస్యంగా రావటంవల్ల, చోటుదొరకక నిలబడాల్సొచ్చింది. అందరూ ప్రక్కన నవ్వారు. నన్ను పరిశీలనగా చూచుకున్నా....రూపాయ వెడల్పంత చినుగు బీదగా నా వంకకు చూసింది. తల వంచుకోవాల్సినఅవసరం లేకుండానే తలవంచుకున్నాను. ఆ చినుగు అందరికి నవ్వు పుట్టించి నందుకు. ప్రపంచంలో ఆనందానికి వీరిచ్చే విలువ ఉత్తమం కాదనుకున్నాను.

అందరం ఆ కొండదగ్గరకు చేరాం. కొంతమంది కొండెక్కారు. కొందరు నడుస్తున్నారు. కొండ పెద్దది. 'చూడు....నన్ను డైనమేట్లతో, ముక్కకిముక్క తెగ్గొట్టున్నారు.' అంది కొండ నన్ను నిదానంగా చూసి....పాపం....దానికి విశేషసానుభూతి చూపించలేకపోయాను. 'మాకు మేడలు తయారవద్దూ?' అన్నా....కొండ బిక్కమొహం పెట్టింది.

రోజుకు రూపాయి కూలికోసం రాళ్ళు పగలగొట్టే వార్ని చూశాను. రోజంతా చెమటకారిస్తే ఒక్కరూపాయి !....ఒక కూలిని ఉండబట్టలేక అడిగాను.

'ఎలా వుంది....తమ్ముడూ నీ జీవితం'....ఎంత కష్టపడుతున్నావ్.... భాయ్!'....కూలి కొండలు ప్రతి ధ్వనించేటట్లు నవ్వాడు!....ఆ నవ్వులో విపరీత నిర్లక్ష్యం, ప్రతీకారం, అసహాయత....ఎంత పెద్దగా నవ్వాడు ?....

కొండ ఉపరిభాగంనుంచి జలం ప్రవహిస్తోంది. 'కొండా!...ఏడవబోకమ్మా!... ప్రపంచం చెడ్డది' అన్నాను.

కొండని బుజ్జగించినందుకు దాని దుఃఖం కట్టలు తెగింది....కొండ కన్నీరు కాల్వలాగా ప్రవహించింది....కూలివాడు చెమటను ఆ మలిన వస్త్రంతో నీరసంగా తుడుచుకొంటున్నాడు....యుద్ధంలోనుంచి తిరిగివచ్చిన సైనికుడిలాగు....నిర్భయంగా....ఆ కార్మికవీరుడు !....బహుశ కొండ తరిగి పోయినట్లు అతడి హృదయంకూడా తరుక్కుపోయి వుంటుంది.

*     *     *

పోయేలోపుగా కొండను ఓదార్చాలని బుద్ధిపుట్టింది.

'చూడు తమ్ముడు....జాతర్లలో దైవప్రీతికోసం....తెగిపోయే జంతు జాలం....ఆహారంకోసం మెడల్ని కత్తికి అర్పించే మృగాలు....స్వార్థంతో జరిగే హత్యాకాండ .... యుద్ధాలు .... దొంగతనాలు .... అన్యాయాలు'.... అన్నాను వుండబట్టలేక. కొండ "అవును .... దుర్మార్గులు ........" అని గర్జించింది. కొండమీద చెట్లు ఉద్రేకంతో ఊగాయ్.

*　　　　*　　　　*

'మా నంఘంలో ....' కొండనన్ను మళ్ళా మాట్టాడనీయలేదు .... 'నాకు చెప్పకు....' అంది.

'పోనీలే....కాని....నీ చొక్కా చినుగుని చూసి నవ్వుతున్నారు'....

. 'నిప్పు మందుగుండుపెట్టి బ్రద్దలు చేసినప్పుడు కేరింతాలు కొడుతున్నారు...'కొంత 'మనిద్దరం ఒకటి' అంది నిట్టూర్పుతూ!

'నెంబరు....యాభయ్' మాష్టరుగారు గట్టిగా పిలుస్తున్నారు.

'ఏమిటి,పరపశత్వం?....' 'కొండభాయ్, వెళుతున్నా....మనమాట ఈ ప్రపంచంవినదు....'

గట్టిగా కొండరాతిని వెల్లకిలా పడుకొని ముద్దుపెట్టుకున్నాను.

మేమిద్దరం ఆ మసకచీకట్లో పరితాపంతో పరస్పరాలింగనముచేసుకున్నాం.

*　　　　*　　　　*

వెనక్కు వెళ్ళిపోతూ ప్రతి ఆదివారం చర్చికిపోయే క్రైస్తవభక్తుని, అడిగాను.

'స్వామీ మీ రెందుకు ఇంత హత్యాకాండ చేస్తున్నారు'....తిండికోసం.... క్రీస్తు, గొఱ్ఱెపిల్లను ఎత్తుకున్నాడు కద !....ఒక చెంపకొట్టిన వానికి మరొక చెంపచూపించమనలేదూ,..."

మతబోధకుడు అన్నాడు.

'అవి ఆహారానికే జన్మించాయ్...వాటికి ప్రత్యేక స్వర్గం వుంది.... మానవుడు ఎంతో విజ్ఞాన మార్జించాడు...బైబిల్ ఏంచెబు'.......

'చాలు...'విరక్తితో నడుస్తున్నాను. చాలదూరంనుంచీ చూశాను...కొండ కాలువ రోదనధ్వని...స్పష్టంగా వినిపిస్తోంది.

'మానవులకంటె...విజ్ఞానివి...విశ్వాసివి...ఇదే నా జోహారు.'

గాలి విపరీతంగా వీచింది. కొండకన్నిటిని అద్దటానికి గాబోలు...ప్రకృతి... యిచ్చే ఓదార్పు.



# ఆమె చూపిన వెలుగు

హడావుడిగా ఇంటరుక్లాసు కంపార్టుమెంటులో భార్యా, బిడ్డలతో ఎక్కేసరికి తల ప్రాణంతోకకొచ్చినట్లయింది. అంతకుముందు బెర్తు అంతా తనే ఆక్రమించుకొని నిద్రించడానికి ప్రయత్నిస్తూవుండిన ఆవిడ మా ఆవిణ్ణీ, పిల్లల్నీ ఎగాదిగా చూసి లేచి కూర్చొని చోటిచ్చింది. నేనుకూడా స్థిమితపడి ఓమూల ఒరిగికూర్చున్నాను—ఆ పుణ్యాత్మురాలి ఘనకార్యాన్ని మనసులోనే అభినందించుకుంటూ.

అంతా మసకచీకటిగా వుంది. శూన్యదృక్కులతో కిటికిలోంచి తల బయటపెట్టి ఆలోచిస్తున్నాను. కాశీలో ఇన్నాళ్ళు వున్నందుకు, చివరకు, నాకున్న మనోబాధ యేమీ తగ్గలేదని తెలిసింది. ఇంతకీ మా ఆవిడ పోరుపెడితే బయలుదేరాను. పడిన ప్రయాసనూ, వ్యయపరిచిన విత్తాన్నీ చూసుకుంటే వేమన చెప్పిన "ఇంటిలోని పోరు ఇంతింత గాదయా" జ్ఞప్తికివచ్చింది! అర్థంలేని ఆలోచనలతో చాలాసేపు అవస్థపడి, ఎప్పుడు కళ్ళుమూశానో తెలియదు. మళ్ళా కళ్ళు తెరిచేటప్పటికి జనసమ్మర్దం తగ్గినట్టుగా వుంది. అంతకంటే ముఖ్యవిషయ మేమిటంటే—మా పిల్లలు మాకు చోటిచ్చిన ఆవిడచుట్టూ అతిస్వతంత్రంగా చేరి అల్లరిచేస్తున్నారు. మా ఆవిడ ఆవిడతో చాలా ఆప్యాయంగా మాట్లాడుతోంది. ఆడవాళ్లలో ఎంత ఆప్యాయత వుందీ!

బాగా చీకటిపడింది. రైల్లో దీపాలు లేవు. నిశీథంలోకి యింక చూడలేక పోయాను. వాళ్ల అర్థాంతరస్నేహానికి నాకు ఆశ్చర్యంవేసింది! వాళ్ళు చెప్పుకునే అస్పష్టవాక్కులను వినటంకంటే అప్పుడు నేను చేయగల ఉత్తమమైన పని మరి ఏదీ కనుపించలేదు. ఆవిడ ఇలా చెబుతూవుంది.

"నా పెళ్ళి నా ఇష్టానుసారం జరిగివుంటే నా జీవితం విషాదాంతం కాకుండా వుండేదేమో! ఆ ముడతలుపడ్డ ముఖాన్నీ, నెరిసిన జుట్టునీ, అయనను నా సౌందర్యంతో పోల్చుకొని ఎన్నో వెన్నెలరాత్రులు ఏడుస్తూ, ఒంటరిగా, మేలుకొని గడిపేదాన్ని! రానురాను గుండె రాయిచేసుకొన్నాను. ఒకవిధమైన తెగింపు, సాహసం, ప్రతీకారవాంఛ నా హృదయంలో

ప్రవేశించాయి! మొదట తన అసమర్థతను కప్పిపుచ్చుకునేందుకు ఆయన నన్ను భయపెట్టి కొట్టినా, కాలక్రమేణా నాకు సేవకుడికంటే ఎక్కువగా లొంగిపోయాడు. ఈవిధమైన మార్పువల్ల నే నాయన్ని ఎందుకు గౌరవించాలో బోధపడలేదు!......అది పిరికితనం కాదూ?

కూలివాళ్లల్లో భార్యాభర్తల్లో ఒకరికొకరు మనలో యిచ్చుకొనే గౌరవాలు యిచ్చుకోలేరు. అయినా వాళ్ళు అనుభవించే ఆనందంగాని, హృదయం విప్పి మాట్లాడడంగాని మనం ఊహించనివి!

ఏమయినా—నన్ని అధమస్థితిలోకి తీసుకొచ్చి, ఏమీ సంబంధం లేనట్లు ప్రవర్తించే సంఘానికిగాని, నేను ఆనందంతో, గౌరవంతో జీవితాన్ని వెళ్లబుచ్చుతున్నానని అందరూ అనుకోవాలని నా నిజ సౌఖ్యాన్ని నాశనం చేసిన తల్లిదండ్రులకుగాని,—వయస్సుదాటినా, పెళ్లిచేసుకొన్నాననే ప్రతిష్ఠ నిలపడానికి నా యౌవనాన్ని బూడిదపాలు చేయ సాహసించిన నా భర్తకు గాని నా దురవస్థమీద ఎటువంటి సానుభూతి లేదని నాకు త్వరలో తెలిసింది! దానిమీద నాలో ప్రతీకారవాంఛ ప్రబలంగా నిలిచిపోయింది. 'ప్రతీకారం'—అదే నా జీవితవాంఛ!!"

ఈ మాటలు వింటున్నకొద్దీ నాకు ఆ కంఠధ్వని సుపరిచితంగా తోచింది! ఆ చెప్పే విషయాలన్నీ 'వివేచనాశక్తి'తో, పటుత్వంగా వున్నట్లు తోచినయ్. ఆవిడ తళతళ మెరిసే వెండిప్లాస్కులోని పాలుకాసిని గొంతులో పోసు కొని మా ఆవిడకూ యిచ్చింది. మా ఆవిడకూడా చాలా శ్రద్ధగా వింటున్నట్లు అగుపడింది!.........

"ఇంతలోనే మా మరిదిపెండ్లి వచ్చింది. చాలామంది స్నేహితులూ, బంధువులూ వచ్చారు. అప్పుడే నా జీవితంలో ఒక మానసిక విప్లవానికి బీజం నాటబడింది. మా మరిదిపెండ్లి బాధ్యతలో మాఆయన పడిపోయినారు.

నేను కేశవరావును అప్పుడే చూడడం! కండలు కట్టిన శరీరం, పచ్చటి దేహచ్ఛాయ, నిగనిగలాడే నల్లటిజుట్టు, ఆకర్షించి, లోతుగా పరిశీలనచేసే, మెరిసే చిలిపికళ్ళు—ఆయనతో మాట్లాడమనీ, పరిచయం చేసుకోమనీ నన్ను వేపుకు తినేవి! నావంక అప్పుడప్పుడు ఆగి, నిదానంగా, ప్రశార్థకంగా

చూసేవాడు. చాలాసార్లు సిగ్గుపడి, ఆ చూపుల వేడి భరించలేక పారిపోయే దాన్ని !..........."నీ కేమిటి లోపం............నే నుండగా ?" అన్నట్లుండేది ఆ చూపు ! మా మరిదికి ముఖ్యస్నేహితుడుగాబోలు—ఎప్పుడూ ఆయన దగ్గిరే కూర్చొని మాట్లాడుతుండేవారు...............నిజం చెప్పొద్దూ ! ఏదో మిషతో వీలైనంతవరకూ ఆయనను చూచేందుకు నేను ప్రయత్నించేదాన్ని!

పెండ్లి అయిదోరోజున ఆయన నన్ను ఒంటిరిగా మేడమీద చూశారు. నే నామన్మథరూపాన్ని మ్రాన్పడి చూడటంకంటె ఏమీ చెయ్యలేకపోయాను. కాసేపు అలానే గడిచింది. తర్వాత మెల్లిగా ఆయన నాదగ్గిరి కొచ్చి నడుం చుట్టూ చెయ్యివేశాడు. ఆ చేతిని నేను తీసివేయలేకపోయాను! ! విద్యుచ్ఛక్తి నాలో ఒక్కసారిగా ప్రవహించినట్లు భావించాను. అసలు ఆ చేతిని తొలగించే శక్తిని అప్రయత్నంగా కోలుపోయాను. ఆయన నాదగ్గరవకు వస్తూవుంటే స్వర్గద్వారాన్ని సమీపించిన ట్లనిపించింది. సిగ్గుతో తల వంచుకున్న నా తలను మృదువుగా పైకెత్తి నాకళ్లల్లో కళ్ళుపెట్టి చూశారు. ఎంత గంభీరమైన కళ్ళు అవి! అందులో ఎన్నో ప్రేమసముద్రాలు ప్రవహిస్తున్నట్లు తోచింది ! నాపెదవుల్లోని ప్రేమమధువును క్రోలారు. కళ్ల నీళ్ళు ప్రవహిస్తూవుండగా "మరిచిపోకండేం" అన్నాను. జయించిన ధీరుడి లాగా "మరిచిపోగలనా ?" అన్నా డాయన తన కళ్లనీళ్లను నా కళ్లనీళ్లతో కలుపుతూ !......నేను భయపడిన లేడిలాగా అతడి హృదయాన్ని హత్తు కున్నాను. అతని శరీరమంతా ఆక్రమించుకొన్నాను...ఆ పండువెన్నెట్లో అతడి శరీరసౌందర్యంమీద నాలో ఇన్నాళ్లూ ప్రజ్వలిస కోరికలు విజృంభించి నృత్యంచేశాయి !

నాగస్వరానికి పాము ఆకర్షింపబడినట్లు నేను వశమైనాను !...అతనిది ప్రణయవేదనకాదు ! ... కామప్రకోపగర్జన !... "బాగుండదు—వెళ్ళివస్తా" నంటూ వెళ్లలేక వెళ్లలేక బయటపడ్డాను అతని దివ్యమూర్తినుండి... అనాటి దివ్యరాత్రికి...విధిలేక......"

ఇంతలో దీపాలు వెలిగాయి. చూశాను......సందేహనివృత్తి అయింది ! ఆ విడనోటినుంచి "కేశవరావు" అన్నమాట వినేటప్పటికే నామీద పెద్ద పిడుగు పడ్డట్లయింది ! అరాత్రి ప్రకృతిగంభీరసౌందర్యంలో చేతుల్లోనా

సలిగిపోయింది మా అవివితో ఇప్పుడు ముచ్చటించే ఆవిడే. పేపరు మొఖానికి అడ్డం పెట్టుకుని దొంగతనంగా ఆమెవంక తేరిపారచూశాను. అవేముఖం! అవే ఎట్టిటి చిన్నిపెదవులు! చూడలేను ఆ శరీరాన్ని!... అవును, ధైర్యంగా చూడగల శక్తిని కోల్పోయాను. ఎంత మార్పు?

పిల్లలు అమాయికంగా ఆవిడతొడమీద నిద్రపోయినారు. వాళ్ల ముఖాల్ని చూస్తుంటే సిగ్గేసింది! ఆ చిన్నిహృదయాల్లో ఎటువంటి రాగద్వేషాలూ లేవు! అవి నిర్మలగంగాస్రవంతులు! ఏం చెయ్యను? నేనే ఆ కేశవరావును రైల్లోనుంచి దూకనా! ఎందు కీవేదన?

దీపాలు మళ్ళీ ఆరిపోయినాయి. ఈ చీకటి నావేదనను కప్పిపుచ్చే రక్షణ.

"ఆ ఉపంతం ముగిసినవెనుక నేను మళ్ళీ ఈ జన్మలో ఆయన్ని కలుస్తాననుకోలేదు. మావారు చాలాకాలం జిల్లాకలెక్టరుగా పనిచేశారు. ఒకసారి ఆయన్ని అకస్మాత్తుగా మరోజిల్లాకు బదిలీచేయడంలో వెంటనే అచ్చటకు బయలుదేరవలసివచ్చింది. నాకు బాగా జ్ఞాపకం. రైలు కదులుతుంటే తొందరతొందరగా మేమున్న కంపార్టుమెంటులోకి ఒక పొడుగాటియువకుడు ఎక్కాడు. తీరా చూద్దునుకదా "కేశవరావు" బంట్రోతు నెట్టివేయబోతుంటే నేను వారించాను. నావంకజాలిక, ప్రేమగా, ఆశ్చర్యంగా చూశాడు. నేను కలెక్టరు భార్యనని తెలునుకాబోలు, ఒక్కసారి అతడి ముఖం వివర్ణమయింది. నవ్వడానికి ప్రయత్నించి విఫలుడైనాడు. రైలు చప్పుడు వింటూ మేము మూగజీవల్లాగా గడిపాం. అతడు దిగిపోతూంటే కూడా నేను పలకరించలేకపోయాను. మా ఇద్దరిలో చెక్కుకట్టిన గాయ్యాన్ని కదిపినట్లయింది.

అతడు కలెక్టరు ఆఫీసులో గుమస్తాపని చేస్తున్నాడని నాకు తెలీదు. అందులో మా అయన కనుసన్నల్లో మెలిగే ఉద్యోగమని ఎన్నడూ ఊహించలేకపోయాను. ఒకనాడు మా అయన ఎందుకో ఏదో అఫీసుపనిమీద కాబోలు అతడికి కబురంపించారు. బంట్రోతుతో "కేశవరావు"ని పిలుచుకొని రా అనడం నాచెవుల్లో పడింది. ఏమిటో నాకు భయము, ఉద్వేగమూ. ఆనందమూ కలిగాయి అప్రయత్నంగా నిమిషంలో ముస్తాబుచేసుకొన్నాను, ఒక్కసారి నారాజు నావంక కన్నెత్తి చూస్తే చాలునని ఆరాటపడ్డాను.

అతడు నెమ్మదిగా కాలుకాలిన పిల్లిలాగ వచ్చాడు. ముఖంలో కళా కాంతులు లేవు. కృశించినట్లు అగుపడ్డాడు. మా ఆయన ఠీవిగా "ఏమయ్యా కేశవరావు" అనడంతోటే వంగి నమస్కారం చేశాడు. ఎక్కడి నుంచి వచ్చింది ఆ వినయం. మా ఆయన పడకకుర్చీలో కూర్చుంటే స్కూలుపిల్లాడిలా చాపమీద కూర్చున్నాడు నారాజు. రాజరాజు సారంగ ధరుణ్ణి రాజాస్థానంలో విచారించినట్లుంది ఆదృశ్యం. నేను చిత్రాంగినా? కన్నీటివెల్లువని కష్టంలో ఆపుకున్నాను. ఇందాకటినుంచి చాటుచాటుగా చూశాను. ఇక భరించలేకపోయాను. మెల్లిగా తెర తొలగించి ముఖాన్ని బయటపెట్టి అతనివంక చూశాను. చాలాసేపటికి తలెత్తి ఆత్రుతగా కళ్లల్లోకి ఒక వెఱ్ఱిచూపు చూశాడు.

"నన్ను క్షమించండి అపచారంచేశాను అన్నట్లుంది ఆచూపు"

"ఎందుకమ్మా అలా చూస్తావు. నువ్వు ఏం అపచారంచేశావు అన్నట్లు" అతడివంక చూశాను.

కాని అతడివద్దనుంచి అర్థంచేసుకొగల సమాధానమేమీ నా కందలేదు. అదొక విచిత్రసంఘటన !...

లోపలికి వెళ్ళి తలదూర్చి భారంతీరేటట్లు ఏడ్చాను. నా స్వామికి నా వేదన తెలియదు. ఈ కన్నీటి వెల్లువను చూసి భరించలేడేమోనని వెంటనే మెల్లగా లేచి నలిగిపోయిన జుట్టు తిరిగి దువ్వుకొని వాకిట్లోకి వచ్చేటప్పటికి కేశవరావు "శలవు" అంటున్నాడు. నాకేమీ తోచలేదు. దాసీదాన్ని పిల్చి గబగబా "రేపు సాయింకాలం అయిదింటికి రండి— అన్నీ స్వయంగా" అంటూ ఒక చీటీవ్రాసి ఆయనకు యివ్వమని దాసీదాని చేతికిచ్చి పంపిచాను. వస్తానన్నారని దాసీదివచ్చి చెప్పేవరకు గుండెల్లో రైళ్లు పరుగెత్తినవి.

మరునాడు అయిదింటికి భయపడుతూ భయపడుతూ వాకిటి దగ్గరకొచ్చి నిల్చున్నాడు. లోపలికిరండి అన్నాను.

తల వంచుకొని "క్షమించమని అడగడానికి వచ్చారని" అన్నాడు.

అసంతాపంలో ఆ ముఖం ఎంత అందగా వున్నదని! మెల్లిగా చెయ్యి

పట్టుకొని లోపలికి తీసుకొనివెళ్లి "ఎందుకూ" అన్నాను. మౌనం వహించాడు నా రాజు. ఆ ముగ్ధమౌనంలో అమూల్య కాలాన్ని వ్యర్థపరచ దలచుకోలేదు. దగ్గరకు లాక్కొని, బుగ్గల్నీ, నుదిటినీ, పెదవుల్నీ, నలిపేశాను. అతడిలో సంచలనం కలిగింది. భయపడిన పిల్లాడిలాగ నన్ను కౌగలించుకొన్నాడు. ముద్దులు కురిపించేడు. నా కళ్లల్లో కళ్లుపెట్టి చూడలేక పోయాడు.

"నన్ను చంపెయ్యరాదూ యిలా ఏడిపించకపోతే?" అన్నాను. భరించలేక ఒకసారి గంభీరంగా నిట్టూర్చాడు! అమాంతంగా ఎత్తుకొని తోటలోకి తీసుకపోయాడు. ఆ చెట్లమధ్య చాలాసేపు గడిపాము.

అలాగే ఏకాంతంగా చింతలేకుండా కొన్ని రోజులు జరిగాయి. ఒకనాడు మేము తోటలో వుండగా మా ఆయన నన్ను పిల్చుకొంటూ నరాసరి అక్కడికి వచ్చారు. ఆ అలికిడిని పసిపట్టి కేశవరావు మెల్లిగా గోడదూకి పారిపోయాన్నాడు. కాని ఆయనకు సందేహం మాత్రం వదలలేదు. ఎవరో వచ్చిపోయినట్లు ఆయన పసికట్టారు.

అప్పటినుంచీ అందుకే ప్రహరీచుట్టూ గట్టి కాపలా పెట్టారు.

మరొకసారి నే నొక చీటి వ్రాసి దాసీదానిద్వారా పంపించాను. మా ఆయనచూసి ఏమిటని అడిగారు.

"కూరగాయలుకొసం చీటివ్రాశా" నన్నాను.

నన్ను పోనిచ్చి, ఆయన దాసిని పిల్చి చీటితీసుకొని చూశారు! ఇంకేముంది? కొంపములిగింది! అయనమననున్సుకు ప్రత్యక్షనిదర్శనం దొరికింది! నాకీవిషయం మొదట తెలీలేదు. ఆయన కడుపులోనే దాచుకొని సమయంకోసం నిరీక్షిస్తున్నారు. మామూలుగానే ఆయన అవలిస్తే ప్రేగులు లెక్కపెట్టేమనిషి నేను నీటుగా ముస్తాబై కనుచీకటిలో "కేశవరావు"కోసం కాచుకొనివున్నాను. నవవసంతుడిలాగ కేశవవచ్చాడు. "ఎన్నాళ్ళు ఈ సందిగ్ధమయజీవితం పెళ్ళిచేసుకొని ఎక్కడైనా వెళ్ళిపోదాం... నే నింతవరకు ఎవరివల్లా అపవిత్రురాలని కాలేదు" అన్నాను, అతని గుండెలమీద తల ఆనించుకొని తోటలో. అత డెందుకో

అవేళ అంత సంతోషంగా లేదు! మేమిట్లా మాట్లాడుతుండగా మాఆయన ఉగ్రరూపంతో అక్కడికివచ్చారు! తేనెనెత్తుటిమీద రాయిపడినట్లు ఇద్దరు కంగారుగా లేచి విడిపడ్డాము. మా ఇద్దరివంక ప్రచండంగా చూశారు. "బుద్ధిలేదూ? ఇదా నువ్వు చేయవలసిన నీచకార్యం" అన్నట్లు చూశాడు కేశవరావువంక! అతడి తలవంచుకొనిపోయాడు.

ఇంక ఆరాత్రి నేనాయనచేతిలో చిదికిపోయినాను. నేను వ్రాసిన జాబు చూశానన్నారు. నాచర్యలన్నీ తనకవగతలేనని చెప్పారు. కసిదీరా గంటలకొలదీ కొట్టారు! గాజులుపగిలి, వొళ్లుసలిగి, జుత్తురేగి, ఆయన పాలిట నేను ఒక దయ్యంగా గోచరించాను! చివరకు "వాడేగా. పో... నీసంరక్షకుడు! వెధవని, ఏంచేస్తానో చూడు అంటూ ఆరాత్రి నన్ను బయటికి వెళ్లగొట్టి తలుపువేశారు. కాని అందుకు నేను విచారించనేలేదు!; ఎప్పుడికన్నా నాజీవితంలో ఇలాంటి దుర్దశసంభవిస్తుందని తలవకపొతే కదా! ఆ చలిరాత్రిలో ఒంటిబట్టతొ మా లచ్చిని వెంటవేసుకొని "కేశవరా" వింటికివెళ్ళాను! నాజీవితంలో చివరి ఆశాజ్యోతి యిక్కడె ఆరిపొయింది!! నరాసరి లోపలికివెళ్లక లోపలికి తొంగిచూశాను. ఆయన తల్లికాబోలు అంటున్నది: "ఒరే...నాయనా నిజమెంతో కాని నీవు కలెక్టరుగారిభార్యతొ ఎక్కువగా మాట్లాడుతున్నావని ఎవరో అన్నారురా! పెళ్లయినవాడివి! చిన్నవాడివా, చితకవాడివా? ఇదెంబుద్ధిరా" అంటున్నది. ఆ చిన్నదీప కాంతిలో ఆయన వేదనపడడం చూశాను. ఆయన కంపితస్వరంతొ ఇలా అన్నారు: "నాకు మెడలువిరిచి పెళ్ళిచేశారు! నేనేంచెయ్యను? నన్ను చంపండి, నరకండి." ఇంక నేను వినలేకపోయాను! కేశవరావుకు పెళ్లయిందని అప్పుడు నాకు తెలియలేదు! ద్రోహి!...అతడు చేసిన ఘనకార్యాన్ని వెల్లడించి అతన్ని "నింద"పాలుచేద్దామనే, ఆక్రోశం నాలో ప్రవేశించింది...కాని నాలాంటి ఆ ఇల్లాలి జీవితంలో నిప్పులుపోయడం నా కిష్టంలేకపోయింది! నాజీవితంనంఘం గొప్పగా విలువకట్టే స్థితిలోకి రాదనీ, ఎన్నడూ రాలేదని నాకు తెలుసు!

తర్వాత నేను పడిన బాధల్ని చెప్పలేను!...చివరకు క్రైస్తవ మతంలో చేరి, వాళ్లదగ్గర విద్యనేర్చుకొని ఉపాధ్యాయ వృత్తితో వుంటున్నా అయిదేళ్ల నుంచీ!" అని పెద్ద నిట్టూర్పుతో ముగించింది.

"అయితే మీ ఆయన గతేమిటి" అంది మా ఆవిడ.

"మొగవాళ్ళుకదూ ! వారు మళ్ళీ పెళ్ళిచేసుకొన్నారుట."

విశేషమేమిటంటే, పాపం, కేశవరావు ఆ ఉద్యోగాన్నే ఎలాగో కాళ్ళా వేళ్ళా అంటిపెట్టుకున్నాడని విన్నా !" అని ముగించింది.

నేను బాధతో, పరితాపంతో కుళ్ళిపోయా ఇంతసేపూ ! మాటలు శూలాల్లాగా నాహృదయంలో పొడుచుకున్నవి ! చీకట్లో మొఖానికి అడ్డంపెట్టుకున్న పేపరంతా తడిసింది.

లైట్లు ఒక్కసారి వెలిగాయ్. ఇంతలో మా ఆవిడ తన ఇంటివిషయాలు చెబుతూ "ఆయనే మావా" రంది. ఒకసారి ఇద్దరూ నవ్వారు! చూచుకున్నా—పేపరు తలక్రిందుగా పెట్టి చదువుతున్నానని !... "ఏమండోయ్—ఇలా చూడండి" అంది మా ఆవిడ. నేను మాట్లాడలేదు. కాని ఆమె దగ్గరికొచ్చి "మంచి నీళ్ళు కావాలా ?—మాటలధోరణిలో మీ సంగతే మరిచిపోయాను !" అంటూ పేపరు తొలగించింది. ఇద్దరూ చకితులయ్యారు ! న న్నావిడ చూసింది. నే నావిడను చూశాను ! మా ఆవిడ ఇద్దర్నీ చూసింది ! ముగ్గురం మాటల్లేక మూగజీవాలమయ్యాం మళ్ళీ! గొంతుపెగల్చుకొని "నన్ను క్షమించండి—రాక్షసుడిని" అన్నా. ఆవిడ నాదగ్గరికొచ్చి అనునయిస్తూ "అయిపోయింది పోనివ్వండి—మళ్ళా ఈ జన్మలో మిమ్మల్ని చూస్తా ననుకోలెదు" అంది. ఆ భీకరరైలుకూతలో నాగుండెమీద తలపుంచి భారం తీరేటట్లు ఆమె విలపించిన విషయం ఎవరికి వినిపించివుండరు ! అది కన్నీరుకాదు ! జరిగిన ఘట్టాల స్మృతికి చిహ్నం !...

ఎంతో మాట్లాడ్డాలనుకున్నాం—కాని మాట్లాడుకోలేకపోయినాం !

రైలుస్టేషనులో ఆగింది. ఆవిడ ఛటుక్కున అయిదు పచ్చకాకితాలు మా ఆవిడచేతిలో కుక్కి "పిల్లలకి నాబహుమానం" అంటూ నావంకకు తిరిగి చూడండి...ప్రేమ ఇప్పుడే ప్రారంభం అయింది. మన జీవితాలు రెండు సమాంతరరేఖలయినా, మనం పాయలుగా విడిపోయినా మిమ్మల్ని మరిచిపోలేను !...అది నా బలహీనతకావచ్చు...కాని నాచివరి సందేశం—

నన్ను మరిచిపోకండేం!" అంది. మా ఆవిడ "ఎందుకండీ ఇవి?" అనేమాటల్నీ, నా భారమైన పిలుపుని లెఖ్ఖచెయ్యక ఆ చీకటిలోనుంచి మెరుపుతీగలాగా మాయమయింది నాస్వప్నరాణి! నన్నునిద్రలేపిపోయింది శాశ్వతంగా!

ఆ నిశీథంలోకి చూడలేకపోయాను. నాపాపంపండి, చివరకు చీకటిగా మారిందా అనిపించింది. కళ్ళు మూసుకున్నాను! కాని నావెనుక శోకమూర్తులు పరిగెత్తుతున్నట్లూ, తరుముతున్నట్లూ తోచింది!...ఇప్పుడు "శాంతి" అంటే అర్థంగాని, అనుభవించటంగాని నాకు తెలియదు! బహుశః...ఎప్పుడో, చిన్నతనంలో పొందినట్లు జ్ఞాపకం!



# చీకట్లో రోదించే బాలమూర్తి

శ్రీమతితో షికారువెళ్ళాను .... మందమందగమనాలతో మైమరపించే మాధుర్యం గలది శ్రీమతి !....

ముంచుకొస్తున్నట్లు పెద్దగా అంగలేస్తు నడుస్తున్న నన్ను చటుక్కున ఆపి "ఈ పరిమళవాయువులు, సౌందర్యశోభ, ప్రకృతి రామణీయత....నా టిష్యూచీరల పయ్యారం....మీకు నరిపడటం లేదాయేం? ఎందుకంత తొందరగా పరుగెత్తు........"

ఆగిపోయి ఆమెను వారించాను.

"వీటన్నిటిని నిదానంగా చూసి, ఆలోచించి, పరవశుణ్ణయిపోయే స్థితి ధాటిపోయింది !...."

నన్నెప్పుడూ శ్రీమతి ఇంత ఆశ్చర్యంతో చూస్తుందనుకోలేదు !....

"మీ దురదృష్టం !...." అంది.

"క్షమించు....మీరు పెట్టుకున్నపూలుచెట్టునుంచి ఎంత బాధతో విడివడ్డాయో ?........ఆ చర్మంతో తయారైన మీ చెప్పులకోసం ఏ జింక బలియై ఇలా వినియోగింపబడిందో ?...."

శ్రీమతి దూసుకుపోయేటట్లు నవ్వింది ? ఆశ్చర్య సంభ్రమాలతో నన్ను చూస్తూ, "ఇవన్నీ అసలు ఆలోచించదగ్గ విషయాలు కావు....పూలు, చర్మం ఇంకా ఎట్లా వినియోగింపబడతాయ్ ?....మానవుడు తన బుద్ధిబలంచేత ఉన్నతుడయి, తను చేజిక్కించుకున్న సౌఖ్యాల్ని అనుభవించటానికి అర్హుడుకాదా ?...."

"బుద్ధిబలంకంటె ఆత్మబలం ఉన్నతమైంది....బుద్ధిబలం తక్కువగా ఉన్న మానవుణ్ణి నీ స్వార్థప్రయోజన నిమిత్తం చంపుతున్నావా?.... మనకంటె బుద్ధిబలం........తక్కువని జీవరాసుల్ని వధించడం,........ ఏ విధంగా........"

శ్రీమతి దీనంగా నన్ను ప్రార్థించింది.

"ఈ ప్రశాంత సమయంలో ఈ వాగ్వాదం ఎందుకూ?"
నేను మళ్ళీ మూగవాణ్ణయిపోయి, ఆకాశంలో విరామం లేకుండా తిరిగే ఆ నల్లమబ్బులపంక చూశాను....చాలసేపు....అవి క్రమంగా అంతరించి పోయినాయ్-

"నిశీథంచుట్టూ ఆవరించింది !........ఎక్కడినుంచో పాతాళంలోనుంచి వినవచ్చిన స్వరంలా....ఓ రోదన ధ్వని........

"శ్రీమతీ...."

"ప్రభూ...."

"విన్నావా ఆ రోదస ?...."

ఏమన్నారు ?...."

"చూడు........దూరంగా మైదానంలో, సెలయేళ్ళు కలిసేచోట........ చీకట్లు ఆవరించే ఆ బయల్లో....ఎలా ఏడుస్తున్నాడో ఆ చిన్ని బాలుడు?...."

శ్రీమతి చూసింది........నిశితంగా జాగ్రత్తగా........ఆమె పరితపించక పోతే ఎందుకు ఆ గులాబి మోము ఎందుకు వైవర్ణ్యం దాలుస్తుంది ?

బరువుతో, విషాదంతో కూడిన హృదయాలతో చాలసేపు ఆలోచిస్తూ చాల దూరం నడిచాం....

ఇంకా ఆ పిల్లవాడు రోదిస్తున్నాడా ? వాడి తల్లి ఎక్కడికిపోయింది ? భరించలేక ఒంటరిగా వదిలిపోయిందా ? విశ్వజననే....మైదానభూమి.... అసహాయ శిశువుమాత !........

శ్రీమతి మౌనముద్ర తాల్చింది !

ఆమె అందమంతా ఆ గంభీర విషాదభావవిన్యాసంలో, మిళితమైవుంది.

దూరంగా, బలహీనంగా ఆ రోదన మెల్లిగా మళ్ళీ విన్నాం....

ఓ దిక్కులేని పిల్లవాడు !........

మా ఆర్ద్రహృదయాలు ద్రవించి సెలయేళ్ల కలయికవరకు ప్రవహించి నవి....శాశ్వతంగా నిద్రపోనీయని ఆ పిలుపు!—శ్రీమతి మాతృహృదయం పొంగింది........మైదానంవైపుకి........ఆ ధ్వనివైపు పరిగెత్తాం............ ఒక్కసారి........

క్రమంగా రోదనధ్వని మూలుగైంది.

అసలు వినపడటం తగ్గిపోయింది. అయ్యో!....మరణశయ్యపై మాతృ హీనుడు!........

ఒంటరిగా, అసహాయంగా, ఆ మైదానంలో, ఆ చీకట్లో, సెలయేళ్ళు కలిసేచోట ఆ బాలుడు చచ్చిపోయాడు ఆశ్రయం లేక....

ఈ కళంకానికి క్రుంగి ఎన్నడూ ఇంతగా బరువెక్కని హృదయాలతో ఇద్దరం తిరోగమించాం....సెలయేళ్ళు భయంకరంగా రొదచేస్తున్నాయ్? ప్రకృతి వాటిద్వారా తన వ్యథని వ్యక్తీకరిస్తున్నదా?....

*　　　*　　　*



# ఆశ్రిత యాత్ర

వెలుగు చీకటిని చీల్చుకుపోయినట్లు, స్టేషనులో ఆవరించిన విషాదనిశ్శబ్దాన్ని, పరుగెత్తి ఒగర్చిన రైలు భగ్నం చేసింది. నాగమ్మ, శూన్యంలోకి గంటల కొద్దీ చూస్తూ మైమరచినదల్లా, ఒక్కసారి లేచి నుంచుంది. ఇప్పుడామె రైలుప్రయాణీకుల్లో ఒకరైఅని అనుకోవచ్చు; లేకపోతే ఈ విశాల ప్రపంచంలో దేనికోనం ఆమె అక్కడ పడిగాపులు పడుతున్నట్లు ?........

ప్రయాణీకులు అనేక దిక్కుల ప్రయాణంచేస్తారు. మీలో ఎవరన్నా నాగమ్మని, 'ఎక్కడికి ప్రయాణం?....' అంటే, ఆమె వెంటనే సమాధానం చెబుతుందనుకో నక్కరలేదు. మీలో కొండమందికి ఆమె దొంగతనం చేసి పరారి అవుతోందనో, లేక కమ్యూనిస్టుదళంలో వుందనో సందేహం వస్తే. దానికి ఆధారమేమీ లేదని చెప్పగలను. నాగమ్మ గొరిల్లా యొద్ధాలు చేయలేదు. ఒకరికి కష్టం కలిగించేటట్లు మాట్లాడలేదు. ఉత్కృష్టమైన శీలానికి, లోకం ఎరుగని త్యాగానికి ఆమె నజీవంగా నిలిచి వుంది.

నాగమ్మ, చంద్రుడు రాత్రిపూట తొంగిచూసే గుడిసెల్లో జన్మించి, మిల్లు యజమానిచేత బలాత్కరించబడి, ఆతడిని గాయపరచి, తాను మరణించి, పతితులు, భ్రష్టులైన కార్మికుల్లో విప్లవోద్రేకం కల్గించిన నాయకురాలు, అమర జీవికాదు. లోకం కష్ట సుఖాల్తో, దైనందిన సమస్యల్తో నంబంధంవుండబోని జమీందారు భార్యకాని, కూతురుగాని కాదు.

ఆమె ప్రబంధకావ్యాల్ని జీర్ణించుకొన్న పండితురాలు కాదు. అక్షరజ్ఞానం లేక పోనూలేదు. నాగమ్మని ఈ భారతవర్షంలో అనాదిగా పుడుతూ చస్తూ వుండే, ఎవ్వరికి తెలియని, అశేష స్త్రీ జనంలో వొకతె అని అనుకోవచ్చు.

'అకలి....దాహం....నిద్ర....'

రైలు పరుగెత్తుతోంది. నాగమ్మ ఒక నిట్టూర్పు విడిచింది. మొదటిసారిగా, ఈ రత్న గర్భలో, ఈ పవిత్రదేశంలో, ఋషులు వేదగానం చేసిన ఈగడ్డన, పతివ్రతలు తమ శక్తితో లోకాన్ని వణకించి సృష్టిని తారుమారు చేసిన ఈ భూమిలో, 'ఎన్నో నంపత్సరాల పోరాటం జరిపాం' అని

నగర్వంగా చెప్పుకొని విప్లవోద్యమాలను తిరస్కరించి ఏ సిద్ధాంతాలకోసం ఈ పోరాటం జరిపారో, వాటిని విస్మరించి, ప్రభుత్వం చేస్తున్న ఈ స్వతంత్ర దేశంలో జన్మించినందుకు.

నాగమ్మని అబల అన్నారు. పుస్తకాల్లోఅట్లా వ్రాశారు. ఇంకా ఆమె సబల ఎలా అవుతుంది ? ఆమెకు విద్య, ఆస్తి హక్కులు, వివాహనిర్ణయం తామే స్వీకరించారు.

ఆమె పుట్టినపుడు దుందుభులు మ్రోగలేదు. పుష్పవర్షమూ లేదు. మేళవాయిద్యాలు, శుభసందేశాలు, విందులు, ఉత్సవాలు ఏమీలేవు. కనీసం తన అన్న పుట్టినప్పుడు జరిగిన తంతుకూడా జరుగలేదు. కొందరు లోపల, బయటకూడ విచారించి, దుఃఖించారు. ఆమె ఏమన్నా పున్నాగనరకం నుండ వారిని విముక్తిచేస్తుందా? తద్దినాలు, శ్రాద్ధకర్మలకి పనికివస్తుందా?

తల్లితండ్రుల దెబ్బలు, అన్నల చీత్కారాలతో ఆమె బాల్యం గడిపింది: ఆమె సమానహక్కులంటూ అన్నలతోపాటు పంచయెకరాల పొలం అడుగుతుం దనుకోనక్కరలేదు. కనీసం తన కన్నివిధాల సరిపోయేవరుణ్ణి ఆమె కోరు కుంది మనస్సులో. టాగూరు మూగ శుభలాగా, ఆమె బయటికి మాట్లాడ లేదు-ఆమెని ఎవ్వరు అడగలేదు. ఆమాట కొస్తే అన్ని ఏళ్లువచ్చిన ఆమె తల్లినికూడా, వాళ్ళనాన్న ఏ విషయంలోనూ సంప్రదించలేదు. నిజమే! ఆమెకు చదువా, పాడా?....పోతే, ఆమె చాలకాలం క్రిందట 'గృహలక్ష్మి బిరుదాన్నిపొంది, అందరూ 'భళీ' అంటే 'ఇదె గొప్ప కాబోలు' అనుకుంది.

నాగమ్మ భర్తనిగురించి విశేషించిచెప్ప పనిలేదు. ఆయన పోతూ ఇద్దరూ ఆడపిల్లల్ని, ఇద్దరు మొగపిల్లల్ని ప్రసాదించి పోయినాడు. అత్తగారు, "కోడ లిక పీడ" స్త్రీ ఉత్తీర్ణురాలవలసిన పరీక్షల్లో ఒకటిగా ఆమెకు జ్ఞాపకంచేసింది. తెలివిగలదైతే, నాగమ్మ ఈ పరీక్షకు తన కోడలిని తయారవమనవచ్చు!....

ఆమె 'లా' చదవలేదు. స్త్రీల హక్కులు, పోరాటాలు ఆమెకు తెలియవు. వాటిల్లో పాల్గొనే తీరికా, ఉత్సాహమూ ఆమెలో లేవు. భర్తపోయిన తర్వాత ఆమె తన ఇంటిని దోచుకొనే బంధువర్గాన్ని ఏమీ అనలేదు. ఆమెకు న్యాయంగా కొంత అనుభవించే హక్కువుండవచ్చు. అయితే ఈ కర్మభూమిలో

సాంఘిక అనాది శాసనాలు దోపిడిగాళ్లు, అవినీతి పరులు నెలకొల్పిన చట్టాలు ఆ హక్కును గుర్తించవు !....

ఆమె తన భావినిగురించి, పిల్లల్నిగురించి ఆలోచించింది. ఇప్పుడామెను చూసి భయపడని బంధువులు లేరు. ఎవరింటి మీదికొస్తుందో అని! నాగమ్మ అమెరికాలో వుంటే ఈపిల్లల్ని ఎవరికోయిచ్చి. లేక (ప్రభుత్వశరణాల యాలలో) ఎక్కడోవుంచి, చక్కా, ఇంకోపెళ్ళి చేసుకొని వుండును! వంద యెకరాల పొలంవున్న స్త్రీని యెవడు చేసుకోడుకనుక!....

'ఆకలి....దాహం....నిద్ర....'

కాని ఈ నాగమ్మ మళ్ళీ పెళ్ళిచేసుకోలేక, చేసేవారూలేక, దిక్కులేక, వున్న అన్నలని ఆశ్రయించింది. ఆమె అన్న ఆశ్రయమిచ్చి ఆమె నెత్తిన పాలుపోయలేదు. వంటమనిషిని మానిపించాడు. అఫీను కూర్చాళ్ళగా మేనల్లుళ్ళు పనికొచ్చారు. బావమరిది ఆస్తి తనచేతిలోకి వచ్చింది. ఇదంతా రూపాయణా పైనలతో లెక్కించే గుమ్మం తొక్కనిచ్చాడు; మరి లెక్కలు అవి చదువుకున్నాడు ఆయన !....చదువు జీవితంలో వుపయోగ పడాల్సిన విధం, అవసరం ఆయనకి తెలుసంటారు. అన్నభార్య, అన్న మొదటిక్లాసులో ప్రయాణించేస్తూ తనని, పిల్లలని మూడవ క్లాసులో ఎక్కించినపుడు, పిల్లలు పాలు ఎక్కువ తాగుతున్నారని విడిగా, పాలలెక్క ఏర్పరచినపుడు ఆమె విచారించింది. ఇది ఆమెలో వున్నగొప్పలోపం!....

నాగమ్మ అన్నగారింటిలో వంటమనిసిగా వుండి కూతుళ్లకు పెండ్లిచేసి కొడుకులకు చదువు పూర్తిచేసింది. ఇదంతా, హిందూ ధర్మములో చెప్ప పడే 'కర్మ' అనుకొని వూరుకుంది. దీనికి ప్రజలూ విశేషం విలువ ఇవ్వ లేదు. అది 'లోకంతీరే' అన్నారు. పోగా, భావాలంటూ వీగిపోయే కొందరు కవుల కలాలలో ఈమె ఆత్మ ఆక్రోశించింది. నూటికి వున్న ఒకరిద్దరు అరిచి నంతమాత్రాన దీనికి విలువ లేదు. ఈర్ష్య పడేవారిగా భావించి లోకం వారిని బహిష్కృతుల్ని జేసింది.

నాగమ్మ కూతుళ్లు, ఆమెవలెనే నిస్సహాయులు గనుక ఏమీ చెయ్యలేదు ఆమెకు. కొడుకుల్లో. భీష్ముల్ని ఆమెచూద్దామనుకుంది. నిజంగా భీష్ములే వాళ్లు!....పోతేవారి భార్యలు వారిని అలాకాకుండా చేశారు!

ఇలా తిరస్కరింపబడిన ఈ దీసురాలికి వంట వచ్చుకదా, అన్నగారు లేడా కూటికి, గుడ్డకూఅని అడగవచ్చు. ఆమె మునలిదైంది. ఇదివరకువాగా శక్తీ అదీ లేదు. ఆమెకు ఎవరు వుద్యోగంయిస్తారు ? పోనీ కొడుకులైనా ఎవరింటిలోవన్నా యిప్పిస్తారా అవుద్యోగం అంటే, అది వారిప్రతిష్ఠకు భంగకరం. తిండి, నీరులేక మాడి ఏ చెట్టుక్రిందో చస్తే ఏంగాక?...."విధి" అని అందరూ మరిచిపోతారు; కాని వంటపూటితనం భరిస్తారా ? పూర్వం ఇది మాత్రం వాళ్ల మామగారింటిలో ఆమె చేయలేవా అని అడగవచ్చు. ఇంతకీ 'రక్త బంధువు',వారిని 'ఉద్ధరించినవాడా'యెసు కనుక ఆ సందేహం ప్రజలలో ఎప్పరికి వుండటానికి ఆస్కారంలేదూ.

తాము సంఘంలోని వ్యక్తులు కనుక సంఘాన్ని తిరస్కరించడం, తమ రక్షణకి, సౌఖ్యానికి భంగం!....

నాగమ్మ అన్నగారు వేదాంతి.! ఏవిషయం వారు పట్టించుకోరు. సంఘ సంస్కరణ, వితంతు వివాహం, రాజకీయాలు ఇవన్నీ బూటకాలు. కత్తికి లేని దురద కందకెందుకు ?

కొడుకులికి, కూతుళ్లకి పనికిరాని నాగమ్మ తన కెందుకు?...." పోనీ ఆయనకూ సంసారం చాలవుంది. ఈ భారం ఏలా మోస్తాడు" అని అడిగేరు !....

ఆయనకి సంతానం లేకపోయినా, పున్నాగ నరకంనుంచి బయటపడే మార్గంచూసే కొడుకును దత్తత చేసికొన్నాడు. ఈ లోకంమీది కంటె పర లోకంమీద ఆయనకి నమ్మకం ఎక్కువ.

రైలు పోతూవుంది. రైలు ఎక్కడ బయలుదేరి ఎక్కడికి చేరుకుందో అందరికి తెలుసు. కాని నాగమ్మకి మాత్రం తన జీవయాత్ర ఎక్కడికో, ఇంతవరకు తెలియదు. వెంటనే ఆమె చొరడానికి అనుమతించని లోకం, క్రమంగా మాడి, కృశించి, తిరస్కరింపబడి, కుమిలి, ఎంత మెల్లగాచస్తే అంత గౌరవదాయకమంటుంది !....

ఈ లోకంలో ఎవరికి తెలీని తన్ను ఉద్ధరించేదెవరూ ?

బీదలు భాగ్యవంతులు; పతితులు-భ్రష్టులు; షావుకార్లూ- ధనికులు;

స్త్రీ-పురుషుడు ; మతం - మోక్షం ; శాంతి - దౌర్జన్యమూ ; సత్యము - అసత్యమూ; త్యాగం-కర్మ ; స్వార్థమూ ఆమె మనస్సులో ఘర్షణపడు తున్నాయ్.

తనలాంటి వారి అజ్ఞాతసమాధులమీద, ఈ యుద్ధఫలితం భావిలో లిఖింపబడవచ్చు.

క్రీస్తు, బుద్ధుడు, గాంధి, వివేకానందుడు, మహమ్మదు, మొదలు గాగల సత్యమూర్తుల సందేశం ఒకవైపు పతితులు, భ్రష్టులు గర్జించే మరో ప్రపంచనినాదం ఒక వైపు ఆమెకు లీలగా వినిపిస్తున్నాయ్.

ఆకలి, దాహం, నిద్ర !....

ఎక్కడ అంతమవుతుందో తన జీవయాత్ర !....రైలు ఆగి పోవాల్సిన స్టేషను సమీపిస్తోంది. దూరాన అగుపడే వెలుగునీడలు, తను అనుభవించిన జీవితం, కలలుగన్న జీవితం - ఈ తారతమ్యాన్ని నిరూపిస్తున్నవి.

ఆకలి, దాహం, నిద్ర.

రైలుకి గమ్యస్థానం వుంది....మరి నాగమ్మ జీవయాత్రకో ?

కాని ఆకలి, దాహం, నిద్ర !



# నాయకుడి జననం

"**కా**లేజీస్టూడెంట్స్‌చేసిన హంగర్‌స్ట్రయిక్‌లో రామకృష్ణ పాల్గొనటమే కాకుండా, కాంపౌండ్ దాటి వెళ్లనందున, ఇతర విద్యార్థుల్ని నిరోధిస్తున్నందున నిన్న పోలీసువారు కస్టడీలోకి తీసుకున్నారు. క్లాసులో మొదటివాడుగాను, బుద్ధిమంతుడుగాను వుండిన రామకృష్ణ, ఇలా ఒక్కసారి తెలివితక్కువగా, బాధ్యతారహితంగా, రౌడీస్టూడెంట్సుతో కలుస్తాడనుకోలేదు. నాకు ఇదివరలో అతడిమీదవుండే విశ్వాసంతో మీకు ఎరుకపరచడం....కాలవశాన మీ అల్లుడు అవటం జరిగింది. ముందు రామకృష్ణ ఇలాంటి విషమ రాజకీయాల్లో పాల్గొంటే మన కంపరికీ ఆశాభంగాన్ని విషాదాన్ని కల్గిస్తాడనడంలో సందేహంలేదు. అపైన మీ బాధ్యత."

ఈజాబు సబ్ జడ్జి రామనారాయణ చూడటంతోటే నిలువునా నీరైపోయినాడు. తీరాతను కూతురికి పెళ్ళిచేసి సంవత్సరంకూడా కాలేదు. అందగాడు, తెలివిగలవాడు, అన్నివిధాలా విమలకు తగినవాడు అని చేశాడు గాని,ఇలా రాజకీయ వ్యామోహ పీడితుడని అనుకోలేదు. పైగా మిత్రుడు ప్రొఫెసర్ రంగారావు వ్రాసింది చూడగా చదువు చాలా దెబ్బతినేటట్లు వుందనే చెప్పాలి. మొక్కై వంగనిది మానై వంగుతుందా ?

"అమ్మాయ్....విమలా ?....గట్టిగా అరిచాడు.

విమల చేతిలో వున్న పుస్తకంతో పరిగెత్తుకొచ్చింది.

"ఏమిటా పుస్తగం చేతిలో ?"

"ఏదో పుస్తకంగాని....నాన్నా....ఎందుకు పిలిచావో చెప్పు ?...."

"నువ్వు చదివే పుస్తకం నేను తెలుసుకోరాదా ఏమిటి ?...."

"...................."

"ఏడిచినట్లే వుంది" ఆయన లేచి, విమలచేతిలో పుస్తకం లాక్కున్నాడు.

'అంతిమ పోరాటానికి కదలి రండు.'

"ఇదా పుస్తకం ! .... అమ్మాయ్ .... నీకేమన్నా పిచ్చి ఎక్కలేదు కద ! రామాయణ, భాగవతాల్లేవా....అటు ఇంగ్లీషులో షేక్స్పియర్ నాటకాలు లేవా....ఎడిసన్ వ్యాసాలు లేవా?....ఈ ముష్టి రాజకీయాలు ఎందుకంట?"

పనికట్టి ఇంతలో పార్వతమ్మ, విమలతల్లి దగ్గుకుంటూ వచ్చింది.

"ఏమిటండీ .... పొద్దున్నే దాన్ని చీదరించుకుంటారు ? .... ఒక్కగాను ఒక్క ఆడపిల్ల !"

"సంతోషించాం—ఇంక నీ భారతాన్ని విప్పకు....అమ్మాయికి విస్తట్లో కూడు నోటికొచ్చేటట్లు లేదు!...."

"ఇప్పుడు ఏమైందని ?...."

"రామకృష్ణని కాలేజీలో హంగర్ స్ట్రయిక్ చేసినందుకు జైల్లో పెట్టారుట....రంగారావు వ్రాశాడు...."

"జైల్లో పెట్టారా....నాన్నా...." అంది విమల సంభ్రమంతో....

"అయ్యో....చదువూ....గౌరవం....రెండూ సున్న...." అని నిట్టూర్చింది పార్వతమ్మ.

"మన రాత....దాని ఖర్మ...." అన్నాడు తండ్రి.

"పోనీ యిక్కడికి పిలిపిస్తారూ ?....ఆ నాలుగూ చెప్పి పంపిద్దాం...." అంది తల్లి.

"పండగలకి రానివాడు....ఇప్పుడొస్తాడా అంట ?...."

"నేనే వెళ్ళి నా తంటాలు పడతాను, నాన్నా....ఈ రైలుకి పంపించండి" అంది విమల....భార్యాభర్తలు ఒకరినొకరు చూసుకున్నారు.

*　　　*　　　*

రామకృష్ణ చాలా వృద్ధిలోకివచ్చి, ఏదో గొప్పఉద్యోగం చేస్తాడని అందరూ అనుకున్నారు. క్లాసులో మొదటిబెంచిపై కూర్చుని, ఆడపిల్లలవంక చూడకుండా, ఫస్టుమార్కులు సంపాదించేవాడి విషయంలో ఎందుకు

సందేహం వుంటుంది గనుక! కాని ఈ రామకృష్ణ ఉన్నట్లుండి విప్లవ వాదిగా తయారయిపోయాడు—నిద్రపోతున్న అగ్నిపర్వతాలు ఒక్కసారి బ్రద్దలైనట్లు—కాని అదైనా సహజమేమోకాని ఇలా విద్యార్థి హక్కులకోసం జైలుకుపోవడం—కాలేజి చదువు చెడగొట్టుకోడం....సహజమైన ఆచారంగా అవుపించదు లోకానికి....

రామకృష్ణని తిరిగి కాలేజిలో చేర్చుకోడానికి ప్రిన్సిపాలు నిరాకరించాడు సమ్మెలో నాయకత్వం వహించినందుకు పేపర్లో పడటం—నలుగురునోట్లో నానడం తప్ప వచ్చిందేమీలేదు. ఇంట్లో తండ్రి మండిపడ్డాడు. వార్ధక్యంలో ఆయనకు వేడిపుట్టి తలవాచేటట్లు చివాట్లుపెట్టాడు.

"పురుషుడివైతే ఎక్కడికన్నా పోయి సంపాదించుకో" అన్నాడు ఒకసారి ఉండబట్టలేక. ఇంక రామకృష్ణతల్లికి ఒకటే ఆశయం....నమ్మకమూను.... వాడు సమర్థుడని—ఏదిచేసినా ఆలోచించి చేయగలడనీ!....

రామకృష్ణ ఒకనాడు ఈజీచైరులో కూర్చుని "దేశనాయకులు" పుస్తకాన్ని చదువుతుండగా విమల హఠాత్తుగా వచ్చి, వాడి ఆలోచనలని అడ్డి, సమస్కారంతో నిలుచుంది. ఇలా రావడం—అందులో తనకే ఇంటిలో స్థానం సరిగా లేకపోవటంతో రామకృష్ణ చికాకుపడ్డాడు.

"మీరూ దేశనాయకులౌతారా ఏమిటిసంగతి?" అంటూ ప్రారంభించి, "చిప్పచేతికి తెస్తారు" అంటూ ముగించింది. అంతకంటె వ్యాఖానం అనవసరం. చదువుకున్న రామకృష్ణ చదువురాని అమ్మాయిని తర్కంలో ఓడిద్దామని వ్యర్థప్రయత్నం చేశాడు.

రామకృష్ణ రాజకీయ అందోళన జరుగుతుండే రోజుల్లో ఒక మీటింగుకి వెళ్ళాడు. వేడి వేడి ఉపన్యాసాలు విన్నాడు. ఇంకా కొన్ని లాఠీచార్జీలు, కాల్పులు చూశాడు కూడాను. పైగా దేశమంతా జోహారులు అర్పించే దేశనాయకుడవాలనే కాంక్ష ఒకటి వేధిస్తోందాయె! "ఇదేసమయం.... చల్లబడిన ఇనుముని సాగకొట్టలేం"....ఇలా ఓ సమావేశంలో యిచ్చిన వూక దంపు ఉపన్యాసంతో 'బి' క్లాసు ఖైదీగా తయారయ్యాడు ఓ రోజు. ఇక్కడ ఓతమాషా వుంది. ఖైదీ జీవితం ఏమీ కష్టంగాలేదు పైగా పూలమాలలు—

పై ఉద్యమాలు బాగానేవున్నాయని పించింది. అందుకే వ్యాపారం చేసుకుం టున్న మల్లయ్యసెట్టి తనతో పాటు ఒక్కలాఠీదెబ్బ తినకుండా, పువ్వులాగా జైలులో వున్నాడు. తను ఇక్కడకి కేవలంయువకులు, న్యాయశీలురూ వస్తారనుకున్నాడు. ధనవంతులు, పత్రికలు అంతా ఎ-బి' క్లాసుల్లో హోదా ప్రకారం సౌఖ్యం అనుభవిస్తుంటే, లాఠీదెబ్బలుతిని బాధపడ్డవాళ్లు 'సి' క్లాసులో అవుపించారు.

ఒకనాడు, జైలుగది వూడవటానికి ఒక ఖైదీ వచ్చాడు. వుండబట్టలేక, ఒకపెద్ద మానసిక వేత్తలాగా వాడిజీవితం భోగాట్టా చేశాడు. తన దొంగతనా నికి చేశానని, బీదరికం కారణమని చెప్పాడు ఆ ఖైదీ. రోజూ చాలామంది వూడవటానికి వస్తున్నారు. చాలామంది ఇలాగే చెబుతున్నారు. రామకృష్ణ ఒకరోజున ఫలాని ఆదర్శమే తన జీవిత పరమావధి అని చెప్పినరోజు లున్నయ్ మానసికంగా పరివర్తన రానిదీ సంస్కరణ విజయవంతం కాదంటాడు. ఇంకోరోజు ఒక ఖైదీ చాలా మాసిన బట్టలతో, పెరిగిన గడ్డంతో వచ్చాడు.

"నీ పేరు?" అన్నాడు రామకృష్ణ.

"ఎందుకులేండి?"

"చెబుదూ....ఒక విషయం అడగాలి ?...."

"రామయ్య....ఏ విషయం బాబూ ?...."

"నువ్వు ఏ నేరం చేశావు ?...."

"అయిపోయిందేదో అయిపోయింది....అవన్నీ ఎందుకు లేండి ?"

"నా చేతనయినంత చేస్తాను....సహాయం....తర్వాత—"

"పొలం తగాదాల్లో ఖూనీ జరిగింది. చాలామంది కొట్టుకున్నాం— చివరకి మా పొలాలన్నా కావు—మా కామందులవి.—వాళ్లే తగువులు పెట్టి మాచేత చేయించారు—"

"నువ్వు ఖూనీచేశావా ?—"

"తాగిన మైకంలో ఏదో కొట్టానుబాబూ—నా కెవ్వరిమీదా కోపంలేదు—

అనలుడబ్బిచ్చి, ఖూనీచేసిన మా నాయుడుగారు తప్పించు కొన్నారు—"

రామకృష్ణ, రామయ్యని పరిశీలనగా చూశాడు. హంతకుడూ మనిషే!— అందులో రామయ్య నిస్సహాయంగా చూస్తుంటే ఏదో సానుభూతి కలపర పెడుతూవున్నది.

"అయితే, బాబూ—రేపు మీరు రాజ్యం చేసేటప్పుడు మా సంగతి చూడండి—"

రామకృష్ణ నిశ్శబ్దంగా బయటకి నడిచాడు.

* * *

రామకృష్ణ ఒకపెద్ద గవర్నమెంటు ఉద్యోగి కాలేదు సరికదా కనీసం దేశ నాయకుడన్నా కాలేదు. జైలునుంచి వచ్చిన మల్లయ్యసెట్టి మాత్రం వ్యాపారం ఇతోధికంగా వృద్ధిచేసుకున్నాడు పరిమిట్లమీద పరిమిట్లు సంపాదించి. ప్లీడరు గుప్తాగారు యమ్. యల్. ఏ. అయినారు. ఇంకా చాలామంది రావుగార్లకి, శాస్త్రిగార్లకి మంచి ఉద్యోగాలు దొరికాయ్ ఖైదీల మానసిక ప్రవృత్తి గురించేగాక, కార్మికుల అనేక దైనందిన సమస్యలమీద, స్త్రీలహక్కులమీద, యమ్.ఎల్.ఏ.లకు, ఛోటా నాయకులకు, సంస్కరణలని గురించిచెప్పడం. వాదించడం, అవి తిరస్కరింపబడటం జరిగాయ్. ప్రతికల్లో జరిపిన ఆందోళన కాకిగోలగా పరిణమించింది.

చివరికి రామకృష్ణ ఏమీ కాలేక, అద్యో గత్యంతరం లేక ఒక ఎన్. జీ. వో అయినాడు. ఇంతవరకు జీవితంలో కలిగిన రెండు అనుభవాలు గెజిటెడ్ ఆఫీసర్నిగాని, దేశనాయకుణ్ణిగాని చేయకపోయినా, ఓ గుమాస్తాని మాత్రం చేసినయ్. సూక్ష్మంగా ఆలోచిస్తే, రామకృష్ణకు ఎప్పటికైనా గొప్ప ఉద్యోగం రాకపోదు. అయితే కొన్ని ఆశయాలుమాత్రం ఆచరణలో పెట్ట వీలులేదని (ప్రస్తుతం) అంటూ వుండాలి. కాని ఈ స్వల్పవిషయం వీడికి ఎంత చెప్పినా అర్థంకాదు. పుస్తకాల్లో విహరించే నాయికా నాయకులు, సామాజిక జీవితంలో ఎలా మారిపోయి, విరహగీతాలు మరచి, వీపు గోక్కుంటూ ఇంటి విషయం ఆలోచించే వెంకయ్యగానూ, అంట్లు

తోమే రాధమ్మగానూ, మారిపోతారో అలాగే ఈ రాజకీయ ఆదర్శాలూను, అంటే నమ్మడు.

ఇంతలో ఎన్. జీ. వో. సమ్మె వచ్చింది. రామకృష్ణ అందర్నీకూడదీసి సమ్మె నడిపించాడు. కాంగ్రెసునాయకులు, పెద్దఆఫీసర్లు, మామగారు, జిల్లాసబ్ జడ్జి రామనారాయణగారు ఎంతో చెప్పారు.

సమ్మె జోరుగా సాగుతోంది. అప్పుడే రామకృష్ణ ఉపన్యాసం చెప్పి, ఇంటికి తిరిగొచ్చి, విమలకు రాజకీయ చైతన్యాన్ని గురించి బోధిస్తున్నాడు. పోలీసులు, లాకప్‌లో పెట్టేదాకా ఆ బోధన ఆగలేదు !

"విమలా...మనకి లేకపోతేయేం .నీకు నగలు, చీరెలూ లేకపోతేయేం..? సత్యాదర్శం ఒక్కటి చాలు...." ఇలా జైలు దాకా చెప్పుకుపోయాడు. విమలకి ఈ భాష అర్థంకాదు.

సమ్మె ఆగిపోయింది, రామకృష్ణ ఉద్యోగం పోయింది. ఇంకెక్కడైనా దొరుకుతుందన్న ఆశకూడా లేదు.

"మేం చెబితే వినలేదు కదూ ?....శాస్తి అయింది." అన్నారు ఇదివర కటి పెద్ద మనుష్యులు.

* * *

రామకృష్ణ జైలునుంచి తిరిగి వచ్చేటప్పటికి ఇంట్లో సామాను చిందర పందరగా వుంది. విమల పెద్దగా ఏడుస్తూ తన గుండెలమీద ఆనుకొని "మీరు వెళ్ళిన మర్నాడే నన్ను హింసించి, ఇంట్లో పుస్తకాలు తగుల బెట్టి లూటీ చేశారు!" అంది.

రామకృష్ణకి ఇప్పుడు గొప్ప వైరాగ్యం వచ్చింది! తనని ఇంక చివరికి మిలిటరీలో గూడా చేర్చుకోరు. జీవితం-న్యాయం వీటి సమన్వయం కుదర లేదు. ఈ అంతరాత్మపరీక్షల్లో రామకృష్ణకి ఏ జిజ్ఞాసాలేదు. మామగారు, తను ఈఉద్యమంలో ఎప్పుడు ప్రవేశించాడో అప్పుడే విడనాడాడు. తండ్రికి తన ఆదర్శాల మీద సానుభూతి లేదు. ఇంక ఆలోచించుకునే గొప్ప భవి ష్యత్తు అగుపడటం లేదు. తల్లి హృదయంలో తనని ఆశీర్వదిస్తుంది; అంతే.

ఆమె తనని సమీపించలేదు. ఈ అఖండ భారతావనిలో, తనసాటిసోదరులు ఎలాజీవిస్తున్నారు ? మనిషి ఆలోచనలకి, ఆశలకి ఒక హద్దు వుంది. దాన్ని దాటి పోయినప్పుడు, జీవితంమీద మమకారం పోతుంది.

విమల కన్నీరు చొక్కా తడుపుతోంది.

'పిచ్చిదానా! ఇదే జీవితప్రారంభం! ఇడివరకటిదంతా స్వాప్నికజగత్తు!"

ఎక్కడి నుంచో దూరాన ఘోషలాగా విజయనాదాలు వినిపిస్తున్నాయ్.

రామకృష్ణకి జొన్నచేలో 'ఎంకి పాటలు' పాడుకోటానికి పొలంలేదు ! 'చల్ మోహనరంగా' అని పాడుకుంటూ మల్లె తెప్పపైన తేలి పోవడానికి 'ఒక చిన్ని నావ' కూడా లేదు !

ఎక్కడనుంచో కార్మికులు, రైతులు, ప్రజలు అందరూ తమ దగ్గరికి వస్తున్నారు. నమస్కారాలు చేస్తున్నారు. జయగీతాలు ఆలాపిస్తున్నారు. హృదయపూర్వకంగా ఆరాధిస్తున్నారు.

విమల కన్నీరు ఆనందంతో మెరిసింది.

ఇప్పుడు రామకృష్ణ దేశనాయకుడు కావాలని అనుకోవడం మరచి పోయాడు. అసలామాటే జ్ఞాపకంలేదు. ఎంతసేపటికీ - సేవ - త్యాగం. ఇదే ఆనందం !

" మీ గుడిసెల్లోనే వుంటాము, మేమూ కూలిపని చేస్తాం. మీ సౌభాగ్యమే మా ఆదర్శం." రామకృష్ణ గర్జించాడు.

"నవజగత్తు నిర్మిద్దాం." ఉప్పెనలాగా వచ్చింది ఆ నినాదం.

విమల హృదయం వికసించింది. ఆమె ప్రత్యక్షంగా 'ఒకనాయకుడి జననాన్ని' చూసింది.



# మతంలేని లోకం

సాయంత్రం ఆఫీసునుంచి అలిసిపోయి, తిరిగి రాగానే, రమ ఎదురువచ్చి చేతినంచి, టోపి అందుకొని గదిలోపెట్టి వాళ్ళమ్మనడిగి ఫలహారం కాఫీ పట్టుకురావడం అలవాటు.

కాని ఆరోజు రమ, నేను వచ్చేటప్పటికి కనబడలేదు. పోనీ ఏదైనా పనిలోవుందా అంటే అసలు ఇంట్లోకూడా లేదు. కాఫీ తాగుతూ నిర్మలని అడిగితె పైభాగం గదిలో ఆరోజే ఒక కొత్తాయన వచ్చాడనీ, అప్పుడే రమతో స్నేహం కలిపి ఎవో మాట్లాడుతున్నాడనీ అంది. నా కాశ్చర్యం వేసింది. ఆ ఖిడియిస్తురాలు, రమ, ఎలా ఈ కొత్త మనిషితో ఇట్టే స్నేహం కలిపిందా అని !........

మెల్లిగా పైకివెళ్ళి గది దగ్గర తచ్చాడుతుంటే రమ 'అదిగో....మా నాన్న గారు........" అంది, ఆయన వొళ్ళోకూర్చుని ఆప్యాయంగా బిస్కట్టు తింటున్నదల్లాలేస్తూ....ఆయన ఎంతో ఆదరంతో లేచి వచ్చి "బాబుగారూ.... రండి...." అని ఆహ్వానించాడు. ఆయన సంతోషంగావున్నా, ఆకళ్ళవెనుక విషాదఛ్ఛాయలు అగుపిస్తునే వున్నాయి. సామాను చిందరవందరగావుంది. మనిషిలో చాల విరక్తి అగుపిస్తునేవుంది. ఆయన అన్నాడు. "క్షమించండి....మీ అమ్మాయని చూస్తే....నా కూతురు బ్రతికివున్నట్లు తోచి నా ఆరాటహృదయానికి ఎంతో శాంతి వస్తుంది....అందుకే...." అని తలొంచుకొన్నాడు. మెల్లిగా డ్రాయరులో నుంచి ఓ బొమ్మతీసి "ఇది చూడండి....మీ కర్థ మవుతుంది...."

చూశాను....అచ్చంగా రమ పోలికలున్న చిత్రం !

"మీ అమ్మాయి....పోయింది గాబోలు....పాపం....ఎలాగైనా రక్త సంబంధం చూడండి" అన్నా విచారిస్తూ....

"మా అమ్మాయి చావలేదు....హంతకులచేత అమానుషంగా హింసించబడి....దారుణంగా హత్యచేయబడింది...." అన్నాడు.

నేను స్తంభించిపోయాను. ఎంతో ఉద్వేగంలో అన్న ఆయన మాటలు నాకు తీవ్రమైన ఆత్రుతని విచారాన్ని కలుగజేసినయ్....మా ఇద్దరిని పితృ హృదయాలు !—

"దయచేసి ఆ సంగతి చెప్పండి....మీ పితృహృదయ ఆరాటాన్ని పంచు కొనీయ్యండి...." అని ప్రాధేయపడ్డాను. అతడు విషాదంగా, బలహీనంగా, అసంతృప్తిగా నవ్వాడు....ఆ నవ్వులో మానవనైచ్యముమీది తిరస్కృతి, స్పష్టంగా ద్యోతక మౌతున్నది.

" చెప్పరూ ?...."

" నా పేరూ హరిదాసు....శైలా పూరులో పేరుమోసిన న్యాయవాదుల్లో నేనొకణ్ని. నాకూతురు జానకిఒక్కత్తె మిగిలింది....ఎంతో మంది సంతానం పుట్టిపోగా—కొన్నాళ్ళకి నా భార్య అకస్మాత్తుగా మలేరియా పీడనతో జానకికి ఘాతృవియోగం నా జీవితానందాన్ని తనతో తీసుకుపోయింది.

తల్లిలేని జానకిని చిన్నప్పటినుంచి నౌకర్ల సహాయంతో నాశక్తి వంచిన లేకుండా అల్లారుముద్దుగా పెంచాను. నా జీవితానికి జానకిని మించిన ఐశ్వ ర్యంగాని, ఆనందంగాని లేదు." హరిదాసులో చెలరేగిన ఆందోళన స్పష్టంగా అతడి కన్నుల్లో కనిపిస్తోంది—కంఠం వణుకుతోంది. నాలోవుండే శక్తులన్ని ఆ కథమీద, సానుభూతితో, కేంద్రీకరింపబడినవి.

" క్రమంగా జానకిని చూచుకొని మురిసిపోయాను. నా శ్రమ ఫలించి, ఈనాటికి యుక్తవయస్సు వచ్చిందికదా అని—ఇంక గౌరవనీయుడైన, సమర్థుడైన ఒక వరుణ్ణి ఆమెకు ప్రసాదించితె ఆమె జీవితానికి ఇంక ఎటు వంటి అడ్డంకులు. కష్టాలు వుండవు' అనుకుంటుండేవాణ్ణి. జానకి అం దంలో రతీదేవి—చారడేసి కన్నులతో అందరిని ఎంతో అప్యాయంగా పలక రించేది. పవిత్రమైన హృదయంతో. దైవ ప్రసాదితమైన సహజలావణ్యంతో ఆమె దేవుడు నాకు ప్రసాదించిన గొప్ప బహుమానమని మురిసిపోని క్షణం లేదు. "

హరిదాసు కంటినీరు చెక్కిలినుంచి జారి చొక్కామీద పడుతున్నది.

తువ్వాలుతో కంటినీరద్ది "మీకు కష్టం కలిగిస్తున్నాను—" అన్నాను పరితాపంతో—

"లేదు-జానకి పట్టభద్రురాలైంది—ఇంక ఆ శెలవల్లో వివాహం చేద్దామని తీవ్ర ప్రయత్నం చేస్తున్నాను. ఇంతట్లొ పంజాబు విభజన వచ్చింది. పంజాబులో అల్లరులు చెలరేగాయ్—ఇంతట్లొ మా లైపూరు ప్రాంతంలో మతకలహాలు చెలరేగి అమానుషకృత్యాలు జరిగినాయ్—ఇంత త్వరలో పిడుగుపడినట్లు అల్లరులు చెలరేగుతాయనుకోలేదు.

గృహదహనాలు స్త్రీల మానభంగాలు దోపిడీలు, హత్యలు విచ్చలవిడిగా జరిగాయ్....ఆ రోజుల్లో ప్రభుత్వం లేదు. పశుబలంవున్నవాడే ప్రభువు—జాలి న్యాయం, సత్యం అక్కడినుంచి పారిపోయినాయ్—ఎంతోమంది స్త్రీలు ఆత్మహత్యచేసుకున్నారు—కాలుతున్న మంటల్లో మానభంగానికి, ఆత్మగౌరవాన్ని చంపుకోలేక పడి చనిపోయారు. హిందూపురుషులు ఎంతో మంది ముస్లిం గుండాల కరకు కత్తికి బలైనారు.

ఆరోజు, పిడుగులాగా, అర్ధరాత్రప్పుడు నలుగురు ముస్లింగుండాలు ఇంటిమీద పడ్డారు. వరండాలో పడుకున్న మాపైన ఇద్దరు మీదపడి లాగారు. పిస్తోళ్ళు ఎదురుగా గుండెలపైపెట్టి లేవతీశారు. నన్ను, తన్ని తాళం చెవులు తీసుకొని, స్తంభానికి తాళ్లతో విరిచికట్టేశారు. జానకిని వివస్త్రని చెయ్యాలని పెనుగులాడుతున్నాడు ఇంకొకడు.

కొద్దికాలంలో ఇంకో నలుగురు పెద్దగా అరుచుకుంటూ తూలుకుంటూ అక్కటికి వచ్చారు. దీంతో నా ఆశలు అడుగంటి బ్రతుకుతామన్ని కోరిక కూడా హరించిపోయింది. ఎలాగైనా జానకిని రక్షించాలని "నా యిల్లు, సొమ్ము సర్వస్వం—మీ స్వాధీనం....మా ఇద్దరిని వదిలిపెట్టండి—' అని ప్రాధేయపడ్డాను.

ఒక పెద్ద వికటహాసం మాత్రమే దానికి జవాబు? జానకి ఆ మొరటు పెనుగులాటలో ఓడిపోయింది. ఆమె చిర తీసివేయబడుతూంది—జాకెట్టు చినిగిపోయింది. జుట్టురేగి, దీనావస్థలో వుంది.....

"మేము మీ మతంలోకి వస్తాం—మమ్మల్ని మటుకు రక్షించండి—" అసలు మతం కాదుగా ప్రధానం !—అని ఎంతోసేపు అర్థించాను.

నా మాట వాళ్లకు వినిపిస్తున్నట్లు లేదు.

"పోనీ—నన్ను చంపండి—ఏమీ ఎరుగని, జానకిని రక్షించండి—మీలో ఎవరన్నా ఆమెని రక్షించండి—అమానుషంగా హింసించవద్దు".... కాని దయ, అంతరాత్మ, అని వేడుకున్నాను. ఇవి ఏకోశానా, కాగడాతో వెడికినా, ఆ రాక్షసుల్లో అగుపించలేదు. ఏం చెప్పను ?—నా వాగుడు కట్టిపెట్టడానికి ఒకడు నా నోట్లో గుడ్డలు కుక్కాడు.

అంతా జానకిని వివస్త్రని చేశారు. అందరూ మోటుసరసంతో ఆమె శరీరాన్ని గాయపరిచారు. జానకి ఎంతో దీనాతిదీనంగా ప్రార్థించింది—నమస్కారాలు పెట్టింది. 'పుత్రిక సమానురాలినంది'—'కనీసం ప్రాణాలన్నా కాపాడమన్నా అంది—ఆ ఆర్తనాదాలు—ఆ దీనాతిదీనమైన చూపు—కాళ్లమీదపడి ప్రాధేయపడటం!—ఏ మానవుని హీనపరచదు ?—కాని ఒకరి తర్వాత ఒకరు ఆమె అందాన్ని. శీలాన్ని చివరకు ఆమె ప్రాణాన్ని హరించి ఇల్లంతా దోచి, మాయమైనారు.

సర్వం పోగొట్టుకొని - ఈ చేతులతో జానకిని దహనం చేశాను.

అప్పటినుంచి మతిచెడి తిరిగాను. ఆ మంటలు ఆ దృశ్యం—నా కళ్లనుగట్టి మతివిహీనుణ్ణి చేశాయ్-నాలో ప్రతీకారజ్వాలలు, ప్రజ్వరిల్లాయి. నాలోని విజ్ఞానం, తర్కజ్ఞానం హరించిపోయినాయ్—ఈ తురక రాక్షసుల్ని చంపి, జీవితం చాలించుకోవడమే నా పరమాశయంగా తోచింది.

ఉన్న కాస్తతో, రక్షణార్థుల కిచ్చిన మూడువందలరూపాయలతో ఢిల్లీకి వచ్చాను.

జానకిని చంపినట్లు ఒక తురకపిల్లని అమానుషంగా హింసించి చంపడమే నా తుది కోరిక. ఈ ఉద్దేశ్యంతో తిరుగుతుంటే, ఒకనాడు భోగం బజారులో ఒక ముసలివాడు ఎదురుబడ్డాడు వాడితో నా ఉద్దేశ్యం చెప్పాను. పది రూపాయలతో ఒక ఇంటికి తీసికెళ్లి, ఆ 'తురక' అమ్మాయిని ఆ రాత్రికి

కుదిర్చాడు. ఆ రాత్రికి ఆ అమ్మాయిని గుండెల్లో పొడిచి చంపి వీలైతే పారిపోవామని నిశ్చయించుకొన్నాను. వొళ్ళు తెలీకుండా బాగా తాగి బజారు కెళ్ళి పదునైన కత్తిని కొని, హుషారుగా ఆ రాత్రికి వెళ్ళాను. మురిపించే అలంకారం శుభ్రంగా అలంకరించి వుంది గది.....ఇంటిమునలిది, "బాబూ భయపడకండి కొత్తనయకు...." అంటూ నావద్దనుంచి యాభైరూపాయలు గుంజి గదిలోకి తోసింది.

అంతవరకు మృదుమధురంగా పాడుతున్నదల్లా ఆపి. లేచి నుంచుంది. నా దేహం, మనస్సు నా స్వాధీనంలో లేవు....ఆమెవంక చూశాను....అంతా ముస్లిం కన్య వేషం....అయినా ఎంతో జాలిగా చూస్తోంది. వేశ్యకన్య లక్షణాలు ఏమీ కనిపించలేదు. మెల్లిగా నా పాదాలుతాకి, "నేను వేశ్యను... కాను....నామాట వినండి...." అంది.

నేను ఈ మాటలకి లొంగిపోదలచుకోలేదు. జానకి ఆత్మశాంతికి, నా ప్రతీకారానికి ఇదే అదననుకున్నాను.

"ఏమీ వినదలచుకోలేదు....నిన్ను సంపూర్ణంగా వినియోగించుకోడానికి నాకు హక్కువుంది...." మొలలోవుండే కత్తిని తడిమి చూసుకుంటూ అన్నాను. ఆ అమ్మాయి జాలిగా పూర్వం జానకి చూసినట్లు నావంకకి చూస్తుంటే ఏమీ చలించలేదు. నా హృదయాన్ని రాయిచేసుకొని "ఊఁ.... కానీవేం ?...." అన్నాను కర్కశంగా....

విధిలేక మెల్లిగా కట్టుకున్నచీరను విప్పబోయి లైటు ఆర్పడానికి గోడ దగ్గరకు వెళ్ళింది.

"ఆర్పడానికి వల్లకాదు...." ఆ మత్తులో అరిచాను. మెలిగా చీర జారిపోయింది. ఆ నున్నటితొడలు, అరటిస్తంభాల్లాగా, మెరుస్తున్నాయ్! ఐనా నాలో ఏ సంచలనం లేదు....ఆ నున్నటి వక్షోజాల్నుంచి నా పదునైన కత్తిదూసుకుపోవాలి!....అప్పుడే నా చిరకాలవాంఛితం నెరవేరుతుంది.... అంతవరకు ఈ అరాటహృదయానికి శాంతిలేదు.

" ఇంకా....అచ్ఛాదనలు ఎందుకు ?...." గర్జించాను ఒక్కసారి....

మళ్ళీ జాకెట్టు విప్పింది. ఇంక నన్నటి లేసుబాడీ, లంగామాత్రం

వున్నాయ్-పూర్వం కవులు అడవుల్లో కష్టాలతో రాచకుమార్తె తిరిగిందని వర్ణిస్తారే....అలావుంది.

"నేను ఎంత పతితనైనా స్త్రీని....ఏమన్నా చేస్తాను....నా ఒక్క నక్యతా సూత్రాన్ని పాటించండి...." అంది భారంగా....కాని ప్రతీకారం! ఎలా మరిచిపోతాను....అసలు ఎందుకు వచ్చినట్లు?....కాని మనస్సులో ఎన్ని ఆలోచనను మెదిలినా, ఆ అమ్మాయి ముఖం పరిచయ మైనదిలా వుంది-కాని నాకు తెలిసిన ముస్లింకన్య మాత్రం కాదు.

"తీసేయ్...." భయంకరంగా గర్జించాను. మెల్లిగా బాడీ విప్పింది.... ఇంక ఆ దృశ్యాన్ని చూడలేను. నా చేతులు వణికినయ్....ఆమె వక్షోజం ఒకటి కోయబడివుంది. నా తల తిరిగి పోయింది, ఏ ఆశయంతో ఆ ప్రవేశంలో పాదవటానికి అక్కడికి వచ్చానో అక్కడ అది సిద్ధించలేదు.

నా మత్తు పూర్తిగా వదిలిపోయింది. జానకికి 'ఈ ఘోర కృత్యం శాంతి నిస్తుందా' అనే మీమాంసతో బాధపడ్డాను. చివరికి నా అంతరాత్మ, నా విషపు కోరికను, నిరాకరించింది.

తలెత్తి చూసేటప్పటికి ఆమె ఘోరంగా విలపిస్తోంది.

" అమ్మా....బిడ్డా ...లే...."అన్నాను ఆమె కన్నీరు తుడుస్తూ.

హఠాత్తుగా ఆమె నా పాదాలమీద వాలి "నన్ను గుర్తించలేదూ.. .మీ పుత్రిక సమానురాలిని" అంది. నా తల తిరిగిపోయింది.

" ఏం ...నువ్వు....ముస్లింవికావూ ? " అన్నా ఆశ్చర్యంతో—అశ్రుధారలతో చొక్కా తడిసిపోయింది.

" కాదు...మీ స్నేహితుడు నరేంద్రబాబుగారి కూతుర్ని—జానకి నా స్నేహితురాలు...ఈ ముస్లింగుండాలు నన్ను హింసించి, ఎత్తుకుపోయి. ఈ పనిలోకి దింపారు..నే నిప్పుడో తురకవేశ్యను—నంఘ జీవనానికి ఒక వేరుపురుగును—"

ఆమె చెప్పలేకపోయింది. నేను వినలేకపోయాను నరేంద్రబాబు నా ప్రాణ మిత్రుడు. ఆ అమ్మాయిని చిన్నప్పుడు, ఎత్తుక తిరిగిన వాణ్ణి....

"నీ కెంత . . . అపచారం జరిగిందమ్మా....పవిత్రమూర్తీ..." అంటూ, జానకి సంగతి, అప్పటినుంచి నాలో కలిగిన పరిణామం...అంతా విశద పరిచాను.

ఎలాగైనా, ఈ అమ్మాయి శారదని రక్షించాలి—వెంటనే, ఆమెను సిద్ధం కమ్మని "ఏమైనాకాని.......మీ తండ్రిదగ్గరికి వెళదాం" అన్నాను. ఇలా అంటున్నానో లేదో ఆ ముసలివేశ్య, నలుగురు గుండాలతో వాకిటిదగ్గర పడింది—

"నన్ను....ఎదిరించవద్దు....అడ్డ మొచ్చిన వాళ్ళని పొడుసాను—" అంటూ దూశాను. ఒక్క క్షణకాలంలో ఇద్దరు అరుస్తున్న శారదని నోరు మూసి లోపలికి లాక్కెళ్ళారు. ఇద్దరు నామీదపడి—కత్తి లాగి, నోరు గుడ్డతో కట్టేసి....ఏం చేశారో ఇంక జ్ఞాపకంలేదు. కళ్ళు తెరిచి చూస్తే, వూరికి ఇరవైమైళ్ళ దూరంలో నిర్మానుష్యమైన ప్రదేశంలో కటికచీకట్లో వున్నట్లుతెలిసింది. దేహానికి తగిలిన గాయాలవల్ల లేవలేకపోయినా తెల్లవారే వరకూ. ఇంకా శారద దీనాతిదీనంగా అరిచిన అరుపులు, కోయబడిన వక్షోజం—నన్ను పిచ్చివాణ్ణి చేస్తున్నాయ్—మానవత్వం ఈ నాటికి ఎంత హీనమైన స్థితికి పొగలిగిందో ఊహించుకో గల్గాను—ఏ విధంగా మానవుడు ప్రపంచంలో జంతుజాలంకంటె విజ్ఞానుడని కలలు కంటున్నాడె చూస్తే, ఎంత సిగ్గుపడాలో వర్ణించలేను!

నేను వెంటనే ఈ కష్టచరిత్రని, నా విషాద జీవితాన్ని అంతమొందించ దలచుకున్నాను. కాని ఇప్పుడు జానకి ఆత్మశాంతికోసం కనీసం నాపుత్రిక వంటి శారదనైనా రక్షించి పోదామని అనిపించింది.

నరేంద్రబాబు గ్రామం వెళ్లాను........సంసారంలో అందరూపోయి, ఆయన ఒక్కడే విచారంతో క్రుంగిపోతున్నాడు. నా మాసినగుడ్డలు, వైఖరి చూసి నమ్మలేకపోయాడు. మొదట ఈ విషాద వృత్తాంతం విని మూర్ఛ పోయినా, తేరుకొని చివరికి ఇద్దరం ఢిల్లీకి బయలుదేరాం. పోలీసు సిబ్బందితో ఆ ఇంటికి వెడితే ఏముంది?...........అంతా ఖాళీ— ఎవ్వరూ లేరు.

అప్పటినుంచి ఎంత ప్రయత్నించినా ఎక్కడా శారద జాడ తెలియలేదు. చివరికి బాల్యమిత్రులం ఇద్దరం ఈనాడు కష్టాల్లో ఒకే పరిస్థితులలో కలుసుకుని. మా జీవితసమీక్షని మననం చేసుకున్నాం. ఆలోచించి మా పుత్రికలు ఏ ఆశయసిద్ధికోసం అసహాయంగా, ఆవేదనతో, అశాంతితో, బలి దానం గావింపబడ్డారో ఆ ఆశయ సిద్ధికోసం మా జీవితాల్ని అర్పించి తద్వారా శారదల్ని జానకిల్ని కనిన ప్రతి పితృహృదయానికి ఒక సందేశం ఇద్దామని నిశ్చయించుకొన్నాం.

నరేంద్రబాబు తన మిగిలిన ఆస్థిని ఇంటిని అమ్మి "శారదా అనాథ విద్యాలయం...." స్థాపించి నన్ను ప్రిన్సిపాలుగా వుండమని అర్థించాడు. తాను తన జీవితశేషాన్ని అక్కడ సేవజేస్తూ గడిపి తరిద్దామని అతడి ఆశ....

నేననుకున్న జీవితాశలు, అన్నీ ఊహ కందకుండా నాశనమైనాయ్..... విరక్తినైనా కూడా "సంఘంచేత తిరస్కరింపబడిన ఈ అనాథలకి"—మతం వాళ్ళ జీవితాల్లో ఎలా నల్లమందులా పనిచేస్తుందో నాఅనుభవంలో జరిగిన ప్రత్యక్ష సత్యం ద్వారా నిరూపించి పోవాలనే వేదనవల్ల, నిలిచి వున్నాను...."

హరిదాసు, ముగించాడు. ఆయనలో అపూర్వమైన కార్యదీక్ష గోచరి స్తోంది. ఆయన విశాల దృక్పథంలో, మతంలేని లోకంలో కష్టాలు ఎరుగని ఒక తండ్రి, ఒక కూతురు ప్రశాంతులై వున్నారు. మెల్లిగాలేచి, నిశ్చలంగా నమస్కరించి "మానసికంగా జానకి అనుక్షణం మిమ్మల్ని పలకరిస్తునే వుంటుంది. కాని భౌతికంగా, రమ, ఆ లోటు తీర్చగలదు. ఏ పాపం చెయ్యక పోయినా, పాపాత్ముల్ని క్షమించే, మీ నిర్మల హృద యానికి 'మతంలేని లోకం'లో విహరించే మీకు, ఈ లోకపు అంతస్తునుంచి ఈ కానుక సమర్పిస్తున్నాను"—

నా కంఠందుఃఖంలో వణికి పోయింది.

ఆయన రమని హృదయానికి హత్తుకున్నాడు. 'మతంలేని లోకం'లో తనకోసం అనుక్షణం ఎదురుజూసే జానకి తన చిన్నచెల్లెనుచూసి అక్కడి

కొచ్చేవరకు సంతృప్తి పడతాడు—నా తండ్రి...."అని అంటున్నట్లుగా ప్రార్థన పూర్వకంగా కళ్ళుమూశాడు.

అప్పటికి, యిప్పటికి ఆ అమరదృశ్యం నా జీవితానికి ఓ అపూర్వ సందేశం.

(అబ్బాస్ ఆధారం)



# మా తృ దే వి

"అమ్మా! దాదీ"

..........................

"అబ్బా!...నర్సు...ఒక్కసారి"

ఉచ్ఛ్వాస నిశ్వాసాలతో, పాలిపోయిన ముఖంమీద దట్టంగా పెరిగిన గడ్డంతో, నాలిక తడుపుకుంటూ పిలుస్తున్నాడు నెం 23 గదిలో వున్న రోగి. ముసలినర్సు మెల్లిగా ప్రక్కగదిలోని సోఫానుంచి తల ఎత్తింది. ఆ మౌనముద్రలో విపరీతతలపులు మెరుపుల్లా మెరిసి మాయమైవుంటాయ్. ఆమెకు ఒకటే ఆలోచన! ఆ రోగి యెవరు? ఆ అభాగ్యుని అస్థిపంజరం చూస్తే ఎటువంటి విషాదవిషయాలు స్ఫురణకువస్తాయి? అతడెవరో తనకు తెలియదు. ఎన్నోవందలమంది వస్తూవుంటారు. ఎవరూ తన హృదయాన్ని ఇంతబలంగా ఆకర్షించి, తన శరీరాన్ని ఇలా కుదిపి, తన్నింత ఆరాటపెట్టలేదు. ఆమె మరిచిపోలేదు అతడి కళ్లని! ఎంత మంచి కళ్లో!....తను ఆ కళ్లని ఎప్పుడో చూసివుండాలి. కారుమబ్బులతో మలిన మైనఆకాశంలో మెరిసే జంటనక్షత్రాలు. ఆనందంకాని, ఆశకాని, తను విశేషించి ఫలానిదాన్ని ఆశించి అన్వేషిద్దామని గొప్ప చెప్పకొనే జీవితం తన కికముందు వుండదని ఆమె ఎప్పుడో నిశ్చయించేసుకొంది. ఆ రోగిని ఎక్కడో పడివుంటే ఈ ఆస్పత్రిలో చేర్చిపోయారు దారినపోయే దానయ్యలు. అతడు—అవును, బాగా జ్ఞాపకం—అతినీరసంగా, చేరెడేసి మెరిసే కళ్లతో నావంక చూస్తూ "ఇంకా నేను చచ్చిపోలేదా?" అన్నాడు. చాలాసేపు పసిపిల్లాడిలా ఏడ్చాడు. తను విధ్యుక్తంగా ఆ అనాథుణ్ణి లాలించింది, ఆ ప్రేమానుభూతివల్ల ప్రయోజనం లేకపోయినా.

"ఎందుకు ఏడుస్తావ్?"

"అంతకంటే నేను చెయ్యగల ఘనకార్యాన్ని ఊహించుకోలేకుండా వున్నాను. అయితే, నన్ను ఏడవనివ్వరా?"

"పూరికే మనస్సు పాడుచేసుకోబోతు. సౌఖ్యం లేసంతమాత్రాన చావు కోరతావా? పిచ్చివాడా !"

"ఒకప్పుడు అందరూ ప్రేమించారు. కొంతకాలానికి ద్వేషించారు. నన్ను నేను గాఢంగా ప్రేమించుకున్నంతకాలం ఎవర్నీ లెక్కపెట్టలేదు."

"సరే, పడుకో"

"నన్ను మీరు మాట్లాడనియ్యాలి. లేకపోతే నేను పూరకోను. ఈ గదిలో గోడలైనా కనీసం వింటాయికదూ !"

పాపం! అతడ్ని చూస్తే జాలి, పరితాపం, సానుభూతి ఎక్కడో తనలో మెదిలాయి. అందుకే అతడిని సన్నిహితునిగా చేసుకొంది.

"నువ్వంటె నాకు చాలా యిష్టం."

ఆ రోగికళ్లు ఆనందజ్యోత్స్నలను వెదజల్లాయి. విషాదంగా, ఖరుకుగా, పెద్దగా, గది ప్రతిధ్వనించేటట్లు నవ్వాడు.

"నాకు చాలా బాధగావుంది అలా అంటుంటే....నన్ను చూస్తే నాకే రోతగా వుంది. నన్ను ఎవ్వరూ ప్రేమించకూడదనే, నేనేదన్నా కోరడానికి వీలుంటే,వాంఛించేది !"

రోగి ఆయాసంగా కళ్ళు మూశాడు. తను అప్పుడు వెళ్ళిపోయింది.

ఆమె అప్పుడే అతడి కళ్లతో తీవ్రంగా వేటాడబడింది. అవెప్పుడో తనకళ్లలో ప్రతిబింబించి తన చెవులో "నా దానివి !" అని గాఢంగా ఘోషించివుంటాయి.

*　　　*　　　*

తడబడే అడుగులతో రోగిగదిలోకి మెల్లిగా నడిచింది. అతడు కన్నులు మూసుకొని అమితాయాసంతో ఒవిధంగా వగర్చుతున్నాడు. ఆ స్థితిలో, ఆ జీర్ణవల్కలాల్లోని వ్యక్తిని చూసి, ఏమీ పరిచయం, సంబంధంలేని మనం చూపే సానుభూతికన్న ఎక్కువసానుభూతినే చూపింది. ఆ దీనవదనం లోంచి కారే అశ్రువులని మెల్లిగా అద్దింది. రెండు ఎత్తయిన పర్వతాల

మధ్యని, లోయల్లో, ప్రవహించే నదుల్లా వున్నది ఆ పరితాపప్రవాహం !

మెల్లిగా "విశూ" కళ్లు తెరిచాడు. తనకే వినపడనంతటి హీనకంఠంతో "నేను నిన్ను చాలాసార్లు పిలిచాను. నామాటలు నీకు వినపడవుకదూ ?" అన్నాడు. నర్సు ఒక్కసారి షాక్ తిన్నదానిలా కంపించింది. ఆమెగుండెల్లో ఎవ్వరో బలంగా కదిలిస్తున్న ట్లనిపించింది. ఆ విపరీతపరితాపంలో ఎలాగో "కాదు" అనగలిగింది.

"నిన్ను చాలాసార్లు పూరికే పిలుస్తుంటా....పూరికేనే........"

"పూరికేనా ?"

"నేను తూచి సమాధానంమాత్రం చెప్పలేని స్థితిలో వున్నాను. కాని నువ్వు నామాట వినాలని నేను అర్థించడంలేదు. తిరస్కరించడానికి సంపూర్ణహక్కు వుంది. కాని నేను మౌనంగా వుండలేనత హృదయదౌర్బల్య స్థితిలో వున్నందుకు క్షమిస్తావా ?"

..............................

"నాకు తెలుసు, నీకూ తెలుసు. నేను చాలా కొద్దికాలంమాత్రమే జీవిస్తాను."

ఆమె ప్రమాస్పద వింటోంది. ఆ మెరిసే కళ్లు ఎప్పుడో తన్ను అతినన్నిహితంగా పలకరించి, ఎలాగైతేనేం, విపరీతఉద్రేకంలో ఊపివుంచి వుంటాయ్ !—

"నాకు నీ దగ్గరికి రావటం ఇష్టం."

బలహీనంగా నవ్వాడు.

ఇద్దరూ మౌనంగా చూసుకున్నారు.

గడియారం గట్టిగా రెండుకొట్టి ఆ నిశ్శబ్దాన్ని చీల్చింది.

"నేను పోతున్నా,"

"ఎందుకు ? ఎవరికోసం ?"

"ఎంత అమాయకంగా అడుగుతాడు" అనుకొంది ఆమె. తనకోసమేనా నేనుందీ యిక్కడ ?....

"చూడు, నీలాంటివారిని చాలామందిని చూడాలి."

"చాలామంది ఉన్నారనుకుంటా చూడ్డానికి; పొరపాటే."

"నీకేంకావాలో చెప్పు ?"

"ఇలా నన్ను చూస్తూ కూర్చోవూ?....మహకవి రాజాస్థానంలో నర్తకిని వర్ణించినట్లు ఊహాపథంలో వర్ణిస్తా. నువ్వు ఇక్కడికి రావాల్సినదానివి కావు. చూడు—నీపేరేమిటో!—ఇలా నావంక నింపాదిగా నవ్వుతూ చూడు! ఎక్కడినుంచీ వచ్చింది ఆ కోమలత్వం ? విను. నువ్వో గంధర్వ కన్యవిసుమా !"

"అబ్బ, చాల్లే !"

"కాసేపు మాట్లాడబోకు. నన్ను మాట్లాడనీను. పగలంతా చెమటోడ్చి పున్నమరాత్రి చంద్రుణ్ణి చూసి కలలుకని, కష్టాన్ని మరిచే అభాగ్యుణ్ణి నేను. నిజంచెప్పు: నువ్వు దేవతవా ?"

"నన్నెందు కిలా వుడికిస్తావు ? ఏమిటో, నీ ప్రతిమాటా నాలో ఇంత పరివర్తనాన్ని ఎందుకు తీసుకురావాలో నాకు తెలీదు. కాని తెలుసుకోవాలని చాలా ఆశగా వుంది."

"అవును. ఇద్దరం ఒక్కస్థితిలో వున్నాం."

"ఏదన్నా కథ చెప్పనా !"

"నాకు అది ఆనందాన్నికాని, బాధనికాని ఉపశమిస్తుందనుకోను. మా అమ్మ కథలు చెప్పకపోతే ఏడ్చి ఏడ్చి నిద్రపోని రోజుల్ని చూసి చాలా ఆశ్చర్యపడుతుంటా. అవును. అప్పుడు చిన్నవాణ్ణి. కల్మషంలేని హృదయం. కల్పవృక్షంవంటి కన్నతల్లి ! నువ్వేస్నన్నా చెప్పు. తల్లికంటె ప్రపంచంలో మానవుడు ఆరాధించవలసిన దైవంలేదు. అందుట్లో ఓ భారతహైందవస్త్రీ మాత, స్థితి ఎంత విషాదస్థితిలో వుండగలదొ తెలుసుకదూ ?"

"ఏం ?....అవునా !"....

నర్సు విషాదంగా నవ్వింది. "అయితే నువ్వేదన్నా చెప్పు"

"నేను చాలా చెప్పదలచుకొన్నాను. కాని ఏదీ ప్రయత్నపూర్వకంగా చెప్పటంలేదు. ఇది నీ కోకథగా తోచినా ఇబ్బందిలేదు."

"ఎందుకూ ?"

"ఏమీ లేదు. కథలన్నా జీవితప్రతిబింబాలే. ఇవ్వాళ నువ్వు చదువుతూ కథలని త్రోసిపుచ్చే వన్నీ ఒకప్పుడు జరిగినవే, చాలా కథలు ప్రపంచానికి తెలియకపోవచ్చు."

"అయితే చెప్పు. నాకు చాలా సంతోషం"

"విను !" రోగి సంతృప్తిగా చూశాడు.

* * *

"ఆ అరుపులు, ఆ కోలాహలం, పరిగెత్తడం పిచ్చికేకలు—ఎవరూ ?" అన్నాడు విశు నింపాదిగా ప్రక్కమీద కూర్చుంటూ.

"ఇవ్వాళ క్రొత్తేమిటి ?"

"వచ్చినప్పటినుంచీ రోజూ సాయంకాలం ఈ కిటికీలోంచి చూస్తున్నా. దూరంగా ఆ ముసలామెచుట్టూ పిల్లలు చేరి ఒకటేగోల. ఎవరామె ? పాపం" జాలిగా నిట్టూర్చాడు.

"ఆమె...." మెల్లిగా అంది నర్సు. "అవును, ఆమె—నీకూ నాకూ ప్రపంచానికీ ఉపయోగపడే స్థితిలోగాని, మన సానుభూతి అర్థంచేసికొనే స్థితిలోగాని లేదు."

"ఆమె పిచ్చిదికదూ ?"

"ఆమెకి ఆనందం ఏదన్నావుంటే ఇప్పుడే. ఎందుకంటే ప్రపంచం ఆవిడకి పిచ్చిలేదన్నంతకాలం ఆమెజీవితయాత్ర నరకయాత్ర అయింది. ఆవిణ్ణి చూస్తే వింతగా వుండటం సహజం !"

"ఆ సంగతి సన్నడగబోకు. నాహృదయం మండిపోతూంది. గత

విషాదస్మృతులు నన్ను కలిచివేస్తాయ్. ఎవరా మాతృమూర్తి ?"

"ఎందుకు అదంతా !"

"ఎందుకో చెప్పలేను. ఒక సానుభూతిపరుడికి చెప్పటంలో నీకేం అభ్యంతరం వుంటుందో ఊహించలేకున్నాను."

"ఆమె అంటే నాకు విశేషపరితాపం. ఇదివరకు రోజూ నాదగ్గరికి పొద్దున్నే వచ్చి పలకరించిపోయేది ! కొన్నాళ్లు సాయంత్రంకూడా వస్తుండేది. ఆమెకుచెప్పుకునేవారెవ్వరూ లేరు. జాలితలచి వాళ్లూ వీళ్లూ ఏమన్నాయిస్తే తింటుంది. ఏపంచనో పడుకొంటుంది."

"ఎవ్వరూ లేరా ఆమెకు ! నీతో ఎం మాట్లాడేది ?"

"ఓ రోజు మా యింటికి తీసుకుపోయి "ఎక్కడికీ తిరగక, యిక్కడే తింటూ పడుకో"మన్నాను. రెండురోజులలావుండి, మూడోరోజున మళ్ళీ మామూలే. ఎక్కడికో లేచిపోయింది."

"ఏమంటూ వుంటుంది !...."

"ఒక్కటే ప్రశ్న. దానికి విధి విరామం లేదు. బహుశా ఆమె జీవిత పర్యంతరం అగుపడే ప్రతి సానుభూతిపరుడి కర్ణపుటాల్లోను భీకరంగా బాధగా ప్రతిధ్వనింపజేస్తూనేవుంటుంది. "మా అబ్బాయి మీ కెక్కడైనా అగుపడ్డాడా? ఓసారి నాదగ్గరకి రమ్మని చెప్పండి. ఏం. చెబుతారుకదూ?" అంటుంది. విశూ ప్రబలంగా పలికిపోయాడు. అలాగే అంటుందా 'ఆమె' !....

"అందరూ విషాదంతో తలవంచుకుంటారు. ఆ త్యాగమూర్తిమాతృప్రేమకు ! 'ఏం, చెబుతారుకదూ?' అంటే ఏమంటారు చెప్పు, ఎవరైనా!"

* * *

ఆమెకు నమ్మకం—ఎప్పుడన్నా, ఎవరన్నా, ఎక్కడన్నా తన కొడుకుసంగతి తెలియచేస్తారని ! ఆ నమ్మకంమీదే జీవించివుంది. ఆ ఉన్మాదమే ఆమెకు ఆనందం. లేకపోతే ఇన్నాళ్లు జీవించదేమో !

విశూ తువ్వాలుతో ముఖం కప్పుకున్నాడు.

"ఎందుకు అలా వెక్కివెక్కి ఏడుస్తున్నావ్?"

"ఏమీలేదు."

"ఏమీ లేదా?"

....................

"పోనీ, బాధ కలిగిస్తే చెప్పనులే."

"నామీద ఒట్టు: నామనశ్శాంతిని చెడగొట్టబోకు."

"మరి దుఃఖించబోక."

"కన్నీరుకారితే నేం!........అవి బాధను ఉపశమింపజేస్తుంటే........ మానసికబాధదర్పణమే కన్నీరు—!"

* * *

"నర్సు....మా కోడలేదీ?"

"ఎవరో పిలుస్తున్నారు!"

"ఆఁ, ఆమె, ఒకసారి మాట్లాడి పంపించివస్తా" మెరుపుతీగలా నర్సు మాయమయింది. శూన్యంగా ఆమెఅడుగుజాడల్ని చూస్తూ గాఢంగా నిట్టూర్చాడు, విశూ—రోగి.

విశూ నర్సుకోసం ఆరోజు చాలాసేపు చూశాడు గాని ఆమెజాడ అగుపడలేదు. మర్నాడు మామూలుగా టెంపరేచర్ చూడ్డానికి వచ్చినప్పుడు చాలా ఆత్రుతతో అడిగాడు; "ఆమెవిషయం దయచేసి చెబుతారూ? రాత్రంతా ప్రక్కంతా కన్నీటితో తడిసిపోయింది. నా మీద సానుభూతి ఈ విషయంలో చూపండి"

ఆమె ఈ విషయాన్నిగురించి అతడింత పట్టు బడతాడనుకోలేదు. మెల్లిగా తల వంచి, తలుపుమూసి ఆమె మౌనంగా కూర్చుంది.

"నా గతించిన జీవితఘట్టాల్ని పునస్మరిస్తున్నాను. కొంత ఆత్మానందం, లేకపోలేదు."

ఆమె జీవితం, నా జీవితం దృఢంగా పెనవేసుకోడానికి కారణం విచిత్రమైందే !

ఆమె అగర్భశ్రీమంతురాలు. తండ్రి మూడోపెళ్లి చేసుకున్నతర్వాత ఆమెనుగురించి శ్రద్ధతీసుకోలేదు. ఏదో పెళ్లి అయిందనిపించడానికి దొరికిన ఎవర్నో తెచ్చి పెళ్లి చేశాడు.

సమర్థతకాని, నడవడికాని లేని ఆ భర్తచేతుల్లో ఆమె వేసారిపోయింది. అయనపోతూ కొడుకుని ప్రసాదించిపోయాడు, బాధ్యతతో—

స్త్రీ ! అందుట్లో బీదరాలు ! ఆ వయస్సులో, సంఘం అన్నివిధాలా లోపాలు కనిపెట్టాలని ప్రయత్నించే విషమసమయం—చచ్చిపోదామన్న అడ్డొచ్చే రక్తసంబంధం....తన కొడుకు ! ఏం చేస్తుంది ? కన్నవారింటి తాలుకూ సవతిఅన్నదమ్ములు తిరస్కరించి, నీచంగా మాట్లాడారు. తన వాడని చెప్పుకుందామన్న తండ్రికూడా అమెకు లేడు. నిశ్చింతగా చచ్చి పోయాడు ఏ సహాయం చెయ్యకుండానే........

ఆమె నాకు చాలాసార్లు చెప్పింది: తనకు జీవితంలో ఒకటే ఆశట ! తన పిల్లవాడు పెద్దవాడయి, గౌరవనీయంగా సంపాదిస్తూ, గొప్పవాడని పేరు పొందితే, తను ఆనందబాష్పాలు రాలుస్తూ, మహరాణిలా జీవిస్తుందట. ఎవ్వరితో చెప్పినా తన కొడుకుని గురించే మాట్లాడుతుంటుందట గర్వంతో.

ఏ ఆశాసౌధాలు అమె ఊహాపథంలో నిర్మించుకుందో, వాటికోసమే ఆమె తన కున్న గౌరవాన్ని, శక్తిని, తనదని చెప్పుకున్న ప్రతిదానిని విన ర్జించింది. గౌరవనీయమైన వంశం. ఆమె అన్నీ మరిచిపోయింది. వున్న మహరాజుల ఇళ్లల్లో అమె వంటపూటితనానికి కూడా వప్పుకొంది. ఎంత శ్రమపడినా, ఎంతమంది వేలుపెట్టి చూపినా అమె శాంతమూర్తియై నిలి చింది. తన పాపను హృదయానికి హత్తుకుంటే అదే అమెకు స్వర్గసీమ ! ఆ సీమలో, ఓ మాతృదేవి-ప్రపంచాన్నెరుగని ఓ అమాయక ముగ్ధబాలుడు మాత్రమే, గోచరిస్తారు.

క్రమంగా కొడుకు బాల్యావస్థని సుఖకరంగానే ముగింపజేసింది. అతడు కూడా బుద్ధిమంతుడు. సక్రమంగా పరీక్షలన్నీ నెగ్గుతూవచ్చాడు.

వాడు పట్టభద్రుడైనతర్వాత న్యాయనా పవ్యాలనుకొంది ఆమె. అతడూ సమ్మతించాడు. సానుభూతి చూపే కొందరు గౌరవనీయుల సాయంతో, విద్యార్థి వేతనాలతో లాకాలేజిలో చేరాడు. అతి కష్టమీద కాలం గడుపుతూ వుండేవాడు.

అతడ్నిరోజూ చూస్తూండేదాన్ని. ఓపవాడవటం చేత మేమంతా నివసించే సానివాడలోనే ఓ చిన్న గది అద్దెకు తీసుకొన్నాడు. అతనికి ఏ దుర భ్యాసమూ, నే నెరిగున్నంతవరకు, అప్పట్లో లేదు. ఆజానుబాహువు, కండలు తిరిగిన శరీరం, నల్లటి ఉంగరాలజుట్టు, పరిశీలనగా చూసే నేత్ర ద్వయం—ఎంత బాగుండేవాడు! చెబుతుంటే ఇప్పటికీ నేను వివశనై పోతుంటాను.

అతడితోటి చదివే సాటివిద్యార్థులంతా మా ఇళ్లకి వస్తూండేవారు. తల్లి దండ్రులు పంపే ధనాన్ని, వాళ్లకి తెలియకుండా, తమ ఆత్మల్ని వంచించు కుంటూ, వ్యభిచారాన్ని, అణచలేని ఓ ప్రచండశక్తిగా నిరూపించడానికి ప్రయత్నంచేసేవారు.

నా సంగతి వేరే చెప్పనక్కర్లేదు. ఈ పతిత భారతదేశంలో, దమ్ములేని, నీలశించిన పిరికిపురుషుల కౌగిళ్లవల్ల కృశించి, నశించిపోయింది నా శరీరం. నే నావృత్తిని మనస్ఫూర్తిగా ఎన్నడూ వాంఛించ లేదు. మా కులపెద్దలు, సంఘపెద్దలు 'సాంప్రదాయం, అందుట్లో దోషంలే'దన్నారు. 'కులవృత్తి' అనే గౌరవపదం చాలు అడ్డంపెట్టుకోడానికి. ఇప్పు డిక్కడ నా శీలాన్నిగురించి అతిశయోక్తులు చెప్పనవసరంలేదు. దానివల్ల నాకు కలిగేలాభం ఏమీ లేదుకనుక. మా తల్లి, ఆమెకు సంబంధించిన రౌడి రాఘవయ్య. బంధువులు అంతా నిర్బంధించారు. తర్వాత చలనం, ఆనందం లేని నా శరీరంలో దురాశ, ప్రతీకారం పుట్టుకొచ్చాయి! ఈమగ పురుగుల్లోకి విషంఎక్కించి, వాళ్లనివంశపారం పర్యంగా నాశనం చెయ్యా లనుకున్నాను.

ఆకాలంలో నేను అందంలో పేరుమోసిన వేశ్యనని పేరుపొందాను. పట్టుదలతో నాప్రాపు పొందటానికి కులవిచక్షత లేకుండా డబ్బుని చాలా మంది విచ్చలవిడిగా వెదజల్లారు.

కాని, నావంకైనా నింపాదిగా చూడని అతడంటే నాకు చాలాకోపం. ఆ యువకప్రవరాఖ్యు డంటే నాకు రోమాంచం కలుగుతుంది. ఆ నడకలో ప్రపంచాన్ని జయించగలననే ధైర్యం ! 'ఎవరో ఆ వీరుడు !'—

ఓసారి మావీథిగుండా వస్తూంటే నా తమ్ముణ్ణి పంపించాను ఏలాగైనా అయన ఇక్కడికి తీసుకొస్తే గొప్ప బహుమాన మిస్తానని. కనీసం 'పూరికేనన్నా పచ్చి, కాస్త పానీయం పుచ్చుకుపొండి'అని అన్నాచెప్పి తీసుకురమ్మన్నాను మొదటిరోజు బిక్క మొహంతో వచ్చాడు వాడు.

మర్నాడు వాడికి క్రితంరోజల్లే చెప్పవలసిన కిటుకులన్నీ చెప్పి, తీసుకు రాకపోతే తిరిగి ఇంటికి రావద్దని గట్టిగా మందలించాను.

ఆత్రుతగా మావాడు అతడితో మాట్లాడ్డం, అదీను. గుండెలు వేగంగా కొట్టుకుంటుంటే దేహం చమటలు పోసేవి—

ఆ ఇద్దరూ చాలాసేపు మాట్లాడుకున్నారు.

గుండె అదుముకుంటూ ఆ వంకకు చూశాను. పర్వతరాజులాగా గంభీరంగా మేకపిల్లలాగా తమ్ముడూ మాఇంటివైపు వస్తున్నారు. నేను మెల్లిగా లోపలికివెళ్లి అద్దంలో నాఅందాన్ని సవరించుకొని కుర్చీలో కూర్చొని ఏదోపుస్తకం తిరగేస్తున్నట్లు కూర్చున్నాను. అడుగుల చప్పుడు గాఢంగా వినిపిస్తోంటే లేచి "స్వాగతం, సుస్వాగతం," అన్నాను. కాళ్లు కడుక్కొ టానికి సుగంధపు నీళ్ళు అందిచ్చాను. అలంకరించివున్న ఆ గదిలోకి ఆహ్వానించాను. పరిశీలనగానే చూస్తున్నాడు. ఆ గంభీరవదనం ఏమీ చలించలేదు. ఇద్దరం మౌనంవహించాం. ఆ మౌనం నన్ను దహి స్తోంది ! చాలాసేపటికి ప్రకంపించే కంఠంతో అన్నాడు—"ఇక్కడికి నే నెందుకు అహ్వానింపబడ్డానో నాకు సరిగా తెలీదు. కారణం కొంచెం చెబు తారా ?" నేనాప్రశ్న, అంత నిర్దయగా, ఆ కంఠంలోనుంచి వస్తుం దనుకోలేదు. నేను తలక్రిందవలసివచ్చిన ఘటన అది !

మాట్లాడలేదు. అసలు మాట్లాడదలచుకోలేదు. అయినా ఏం మాట్లాడను! "నాలో ప్రత్యేకతఏదన్నా మిమ్మల్ని ఆకర్షించిందేమోనన్న సంశయం

నన్ను బాధిస్తోంది. నాకు ఎవరన్నా నాకు తెలియకుండా విలువయిస్తుంటే నేను బాధ్యుణ్ణి కాదు."

"నేను చెప్పదలచుకొంది విపులీకరించడం మంచిది ఎందుకైనా! నన్ను మీరేదృష్టితో చూస్తున్నారో ఆ దృష్టికి నేను బాధ్యుణ్ణి కాదు! అయినా మీ రీవిషయంలో బలహీనత కనపరిచినా అడ్డుపెట్టడానికి నేను అర్హుణ్ణి కాదు."

నేను మౌనం వహించడంలో ఇంక అర్థంలేదనుకున్నాను. "నేనేదృష్టితో మిమ్మల్ని చూస్తున్నానో అదేమంత, మీదృష్టిలోగాని, చాలామంది దృష్టిలో గాని గౌరవంకలది కాకపోవచ్చును. నా బలహీనతకు క్షమించినందుకు మీకు చాలా కృతజ్ఞురాల్ని."

అతడు ఓసారి తలెత్తి చూశాడు పరిశీలనగా. ఆ చూపులో ఆశ్చర్యం, సింపతీ స్పష్టంగా గోచరించాయి.

"ఈమాత్రం వచ్చినందువల్ల మీరు ఏమన్నా సంతృప్తిపడివుంటే తృప్తి పడతాను....సరే వెడుతున్నాను ఇప్పుడు."

నేను అదిరిపడ్డాను. అయినా ఆత్మాభిమానంతోనే "మీరు వెళ్లిపోతానని దృఢంగా చెబుతున్నప్పుడు బలవంతపరిచి ప్రయోజనంలేదు. కాని నేనిచ్చే ఈ అల్పఅతిథిసత్కారాన్ని ఓ నూతనపరిచితుడిగా స్వీకరించాలని ప్రార్థిస్తున్నా" నన్నాను.

నేను అమర్చిన మధురఫలాల్నిగాని, ఫలహారాల్నిగాని, పానీయాల్ని గాని అతడు ఏమీ ముట్టుకోలేదు. మంచినీళ్లుమాత్రం త్రాగాడు.

" నమస్తే. నా కిదే తృప్తి"

" నా ప్రార్థన ఒకటి మన్నించండి"—అతిదీనంగా వేడుకొన్నాను.

" ఏమిటి ?" అన్నాడు ఆత్రుతగా.

"ప్రపంచం బాధగా అగుపించిన ఘట్టాల్లో నాకు సాధ్యమైనంత సేవ జేయనీయండి. తీరిక సమయాల్లో వస్తారా కదూ ?...."

మమత పదిలిసట్లు కాసేపు ఆలోచించాడు—జిజ్ఞాసతో—

"దీంట్లో అభ్యంతర పెట్టాల్సింది నేనున్న పరిస్థితిలో ఏమీ లేదు. కాని ప్రపంచంలో అర్థించినా, అవస్థపడినా ఎవరూ నా వంక చూడలేదు. అందుకే మీరు వాళ్లకంటే చాలా ఉత్తమోత్తములని నా అభిప్రాయం. నమస్తే."

శరవేగంతో వెళ్లిపోయాడు. ఆ మెఱుపుతీగ! ఊహించుకున్న తృప్తితో-నిట్టూర్పు!

*  *  *

"అతడు వెళ్లిపోయాడు. ఆ నడకలో ఎంత రాజసం! ఎంతఠీవి" ఈ ఊహలతో తీవ్రంగా చాలారోజులు వేసారిపోయాను. ఆ దివ్యతేజోమూర్తి నేను కలలుకనడానికేనా నా మనఃపథంలో మెరిసింది! ఎందుకు నా యౌవనం, రూపం, భాగ్య సంపదలు! సంతృప్తిలేని జీవితానికి ఇవన్నీ తృణప్రాయాలనుకున్నాను. తమ్ముణ్ణి చాలాసార్లు పొమ్మన్నాను. వాడు కొన్నిసార్లు పోయీ, మరికొనిసార్లు పోయిరానని చెప్పీ, మొత్తానికి ఒకటే కర్ణకఠోరమైన సమాధానం చెప్పేవాడు అవును. నాలో వేదనని వాడు గుర్తించుకోలేదు. అంతెందుకు? నేను ప్రేమించగలనని హృదయ పూర్వకంగా ఎవ్వరూ నమ్మరు! నేను కాచుకుని కాచుకుని చలసంలేనిదా' న్నయినాను నారాజురాడు! నేను విపరీతంగా పరితాపపడ్డాను. వేశ్యను. నా మాట నమ్మరు. ప్రజలు గౌరవించే స్థితిలోకి నేను ఎప్పుడూరానని తెలుసు. మళ్లీ ప్రజలే చాటుగా నన్ను అర్థించి, స్వార్థంగా, నత్యాదర్శానికి దూరమౌతారు!........

నేను వేశ్యనవటానికి కారణం? అమ్మా రాఘవయ్యా వాళ్లు నిర్బంధించ బట్టేనా! వాళ్లు నిర్బంధించటానికి కారణం? దారిద్ర్యమా? శీలంకంటే దారిద్ర్యం ఎక్కువా? దారిద్ర్యాన్నే ముఖ్యకారణంగా భావించడానికి వీలులేదు. ఎంచేతనంటే మేము కట్టుబట్టలకూ, తిండితిప్పలకూ తీసిపోయినవారం ఏవిధంగా చూసినాకాము! ఏమయినా అవనీ, నేను వేశ్యను! ఎందుకీతర్కం? ఎందుకిబాధ-పరితాపం తిరని మనోవేదన!!! ఓవిధంగా చాలామంది హిందూస్త్రీలకంటే, భర్తలులేనివారికంటే చాలా స్వతంత్రంగానే వున్నాను. నన్ను ఎవ్వరూ శాసించటానికి వీలులేదు. నేను

చాలామందిని తిరస్కరించగలను. మారాంచేసి బుజ్జగింపబడగలను కాకపోతే, ముందుజన్మలో ఏమైనాగాని! కళ్లముందర నేను చూడని, అనుభవించని కష్టసుఖాల్లో, అందుట్లో పచ్చిపోయింతర్వాత. ఏమైనా ఫరవాలేదు!

నా అత్మసంతృప్తికోసం ఇలా సమాధానపరుచుకో ప్రయత్నించేదాన్ని"

"అతడు రాలేదా?" విశూ చాలా అత్రుతగా అడిగాడు.

ఆ మునలినర్సు కళ్లల్లో అగాధ సముద్రాలు!

"రాకుండాపోలేదు. మా ఇద్దరికీ...." ఆమె ఛటుక్కున ఆగిపోయింది. చాలా సేపటికిగాని ఆమె తేరుకోలేదు.

"విను, ఏమైందనుకున్నావ్?"అంది విషాదంగా మళ్ళీ—

విశూ మహనత్వుడైన గురుదేవుని పాదాలముందు శిష్యుడు వినయంగా కూర్చున్నట్లు కూర్చున్నాడు. అలసట, అలుపు మరిచే జవసత్వం ఎలా వచ్చిందో!

డాక్టరు కిటికీలోంచి చూశాడు ఇద్దర్నీ. రోగిముఖంలో ఆయన చాలా మార్పు కనిపెట్టాడు. ఆ నిశ్శబ్దం మూర్తీభవించిన గదిలో వారిద్దర ప్రపంచం అనుకున్నట్లు కూర్చుకున్నారు పరవశత్వంలో!

కాసేపు చూసి డాక్టరు పరీక్షించకుండానే పోయాడు, తృప్తితో.

"నేను చాలా నిరాశ చేసుకున్నప్పుడు, వస్తాడని ఎప్పుడూ అనుకోనప్పుడు అతను అదరాబాదరాగా ఓ రాత్రి వచ్చి తలుపుగొట్టాడు. నేను మొదట ఎవరో ననుకొని "ఇప్పుడు వీలులేదు" అని నిద్దరమత్తులో అన్నాను విసుగ్గా.

కాని, ఆ గంభీరనినాదం నా మత్తును వదలగొట్టింది. నా స్వామి తన భక్తురాల్ని రక్షించడానికి వచ్చాడు. నేను ఆశ్చర్యఆనందాలతో అతడ్ని వేయిప్రశ్న లడిగాను. మధురంగా స్వేచ్ఛాగానం చేశాను. ఎంత నిబ్బరం కనపరిచాడు! ఏమీ తొణకలేదు మొత్తంమీద ఆ ప్రవర్తన ఉన్నతంగా వుంది.

"నే నెందుకు ఇక్కడికి రావల్సివచ్చిందో అనే విషయం చెప్పకోటాని కేమంత ఘనమయిందిమటుకు కాకపోవచ్చు—' 'వితరణతొ అన్నాడు.

అర్థవిహీనంగా నాస్వామినేత్రాల్లోకి చూశాను. నిశ్చల, నిరీహ, నిరీష నేత్రాలు !

"నేను, నిన్ను, నువ్వనుకునే విధంలో సంతోషం కలిగించాననుకోటం మాత్రం పొరపాటుకావచ్చు"

"ఏమిటో చెప్పండి మరి...."

"ఇప్పుడు నాపరిస్థితి నీకు కొంత చెప్పటం అవసరం. నేనో పేద విద్యార్థిని. మాఅమ్మ...." అతడు ఆగిపోయాడు. గాఢవిషాదాచ్ఛాదికమైన ఆ మొహంలో శోకపూరితస్వరూపం ఓ నిమిషం తాండవించింది.

"అదంతా అనవసరం ప్రస్తుతం. నాకు డబ్బుకావాలి అవసరంగా" అన్నాడు.

నా స్వామి కోరితే చాలు ! ఆలోచించడంకూడానా ? వేటని, తృణ ప్రాయంగా చూసి నారాజును స్మరిస్తున్నానో, ఆ విసయశలునికే అది ఉపకరించబోతున్నది.

నేను కారణం అడగలేదు. నాకు తెలియటం అనవసరం. కావలి సింది డబ్బు—అంతే !....

అల్మరా తీసి చూశాను. అప్పుడే పేరయ్యశెట్టి తాలూకు నాలుగువందల చిల్లర అగపడ్డాయి. మాట్లాడకుండా అతడి జేబులో కుక్కాను.

"ఎందుకు అదంతా ? నాకు యాభైరూపాయలు చాలు" అన్నాడు.

"తిరిగి యిస్తే ఒట్టు"—చేతులు పట్టుకొని బలవంతపరిచాను.

"నేను తిరిగి వీటిని మీకు ఎప్పుడు ఇవ్వగలనో సరిగా చెప్పలేని స్థితిలో వున్నందుకు సిగ్గుపడుతున్నాను."

..............................

"మీరు సన్నెరగరు. హామీ యివ్వడానికి నా చదువుకునే పుస్తకాలుతప్ప

ఏమీలేవు. అవయినా, ఎవరో వాడుకోటానికి యిచ్చినవే...."

"నాకు మీరేమీ చెప్పకుండావుంటే, బాధ, కలిగించకుండావున్నవా రవుతారు. మీదగ్గరినుంచి తిరిగి తీసుకుంటా నన్నది కల్లోమాట. చిన్న కోరిక మీకు సహాయం చేస్తూ బలవంతం చేస్తూన్నా ననుకోబోకండి. అప్పుడప్పుడు నా కగపడు తుంటారుకదూ ?"

"మీరు ఏ నమ్మకంమీద నా కిస్తున్నారో తెలీదు. కాకి నేటికి నా జీవితంలో ఒక మానవత్వంగల జీవి. సాహచర్యం నాకు లభించినందుకు జోహార్లు....

"ఈచీకటిలో ఎక్కడికి పోతారు ? ఇక్కడ వుండరాదూ ?" అన్నాను.

"నాకు పరీక్షరోజులు దగ్గరికొచ్చాయి, ఏవిధంగానూ ఇక్కడ వుండ టానికి అవకాశంలేదు."

"వెళ్లి చదువుతారా ?"

"అవును. మాఅమ్మ చాలా కష్టపడి చదవమని చెప్పింది. మాఅమ్మని— ఆ ప్రేమమూర్తిని - లోకాలంతా నివ్వెరపోయి చూసే త్యాగాన్ని చూసి చాలాసేపు శ్రమిస్తాను."

"మీకోసం అంత త్యాగం చేసిందా మీఅమ్మ ?........"

"ఆమెత్యాగాన్ని నేనుపూహించినంతే చెప్ప కలుగుతున్నాను. అసంఖ్యాక నోరులేని దరిద్ర నారాయణుల కఠోర ఆక్రందనాలకి ఒక మూర్తీభవించిన స్వరూపం....ఆరాధించే దేవి—నా తల్లి...."

"ఎప్పుడైనా జ్ఞాపకమొస్తే నానమస్కారాలు అందజేయగలరా ?...."

"ఆఁ, తప్పకుండా"-పరిశీలనగా చూశాడు.

"దయచేసి అందజెయ్యబోకండి. పొరపాటున అన్నా. నేను మాతృ మూర్తిని కాను. కాలేనేమో ! వేశ్యనికదూ ? పోనీ, ఎవ్వరికి తెలియకుండా ఆరాధించుకోనీయండి నన్నూ" సూటిగా, అసహాయంగా చూశాడు. ఇద్దరం, శూన్యంగా నిశీథంలోకి చూశాం. మా మధ్య అగాధాలు !

"శ్రమకల్గించినందుకు క్షమించండి. శెలవు."

"వస్తుంటారుకదూ ?' గద్గదస్వరంతో అర్థించాను వుండబట్టలేక మళ్లీ.

"తప్పకుండా. తప్పించుకోలేను" తొందరగా తలవంచుకొని వెళ్లి పోయాడు. నన్ను నిరాశలో ముంచి నిశీథంలోకి పోయాడు."

* * *

ఆ ముసలిసర్సు లోకంలోకి వచ్చి, తలెత్తి, రోగిని చూసింది! ఒకటే అశ్రు ధారలు ఎంత సేపట్నుంచో !—కళ్లు ఎఱ్ఱబడ్డాయి. పాపం! ఆమె మెల్లిగా తువ్వాలుతో అద్దింది.

"చెప్పు దయచేసి. నా ఆనందానికి అంతరాయం కలిగించబోకు"

"ఎందుకు అంత పరితాపం?...."

......................

"నీవంత జాలిగుండెగలవాడు వసుకోలేదు. పాని, మానేస్తాలె. మరి ప్రశాంతిగా వుండు...."

"ఏమీలేదూ" విశూ ఏమీభావం వెలిబుచ్చని స్వరంతొ అన్నాడు.

"నాకు చెబుతుండవూ. అదే చాలు. అంతకంటే గాఢంగా కోరేది లేదు. దయచేసి చెప్పు !...."

ఆమె అతడికి పాలు యిచ్చింది. విశూ నిరాకరించాడు.

"రోగం తిరగబెడుతుంది. నా మాట విను"

"నేను జీవించాలని నాకు లేదు"

"నువ్వింత విరాగివనుకోలేదు; అయినా బ్రతికున్నవారిలో చాలా మంది జీవితంలోసుఖం పొందగలమని కాదు—వూరికేనే చావలేక—అర్థంగాక జీవిస్తున్నారు...."

"నేను పాలుత్రాగడం నీకు ఏ మాత్రమైనా తృప్తికలిగిస్తే యివ్వు.... ఎందుకు అభ్యంతరపెట్టాలి?"

విశూ, అయిష్టంగానే తన శరీరానికి మేలు చేకూర్చాడు. రోగులు—తనలాంటివారు ఎంతమందో ? "దయచేసి చెప్పండి. నేను వింటూనే అంతమవుతాను కానీండి....ఊఁ...."

ఆమె చకిత అయింది. ఎవరీదుఃఖభాజనుడు? ఇతడెవరో తనకు తెలీదు. గత యాభైసంవత్సరాలనాటి జీవితగాథను ఎందుకు చెప్పాలో? అతడెందుకు అంత ఆత్రుత కనపరుస్తున్నాడో? అయోమయంగావుంది. కాని ఎవ్వరూ సానుభూతిని చూపని ఈ అభాగ్యునివంటి జీవితం ఎవ్వరికీ, ఎప్పుడూ ఆ నిర్దేత ప్రసాదించవద్దనే ఆమె వేడుకొంది.

"బహుశః నా గురించి నీకు జాలికలగవచ్చు....నువ్వే కాదు. నా రాజు కూడా కరిగిపోయాడు."

మళ్ళీ ఓ రోజు రాత్రివచ్చాడు. పెరిగిపోయిన గడ్డం, కృశించిన దేహం.... ఆ మలినవస్త్రాల్లో, నల్లమబ్బుల్లోని శశిలా వున్నాడతి నా ప్రభువు. ఇలా అన్నాడు. "ఆ వేళ డబ్బివ్వకపోతే ఏం తలపెట్టేవాడినో? ఎలాగూ అమ్మ నాకు సాయం చేయలేదు కదా!—ఈ నెలవల్లో మీ దగ్గర నన్ను గుమస్తాగా నన్ను పెట్టుకోండి. నేను మీ అప్పు తీర్చందే ఎక్కడికీ పోదలచుకోలేదు."

అతడ్ని చూస్తే విపరీతవిచారం. మెల్లిగా మాటల్తో స్థిమితపరిచాను. భోజనం పెట్టి, మంచిబట్ట లిచ్చాను. మెల్లిగా "మీరు నాకు డబ్బివ్వకపోతే, ఇక్కడ వుండదలచుకోలేదా?" అన్నాను.

కొంచెం ఆలోచించి అన్నాడు: "వుండను."

నేను ఆతడ్ని ఆ కారణంగా పొగొట్టదలచుకోలేదు."

"మీరు ఇక్కడ వుండటంకావాలి—ఎలా భావించుకున్నా ఇబ్బంది లేదు."

అంగీకరించాడు. అతడున్న ఆ రెండునెలల్లో పరపురుషుణ్ని నా గుమ్మం తొక్కనీలేదు. చాలామందికి నాకు పెళ్లయిందని చెప్పాను. ఎంతమంది ఎన్నివిధాలుగా అనుకున్నారో, గాని!—అప్రస్తుతం.

అమ్మా, రాఘవయ్యా ఈ విషయంలో నాకు కలిగించిన వత్తిడిమాత్రం వున్న ఏ వ్యక్తిగాని సహించరానిది. అతడ్ని చూసుకునే అన్నిటి అంగీక రించాను. నేను మీకు అగుపడాలంటే నా యిష్టానికి వ్యతిరేకులవకండని మందలించాను. వాళ్లు తమాయించు కున్నారు. ఎప్పుడైనా నావెత్తితగ్గి

మొదటి స్థితిలోకి రాగలనని వారినమ్మకం. నన్ను వదిలిపెడితే వారికి భోగలాలనలేదు మరి........

అతడి స్నేహితుడు-మాయింటికి అప్పుడప్పుడు వస్తుండేవాడు—శంకర్. అతడు నన్ను కాళ్ళా వెళ్ళా పడి అర్థించాడు. తన సాహచర్యాన్ని విరమింప జేయ వద్దని, అగర్భశ్రీమంతుణ్ణనీ, నన్ను మహారాణిని చేస్తాననీ చాలా ఆశలు గొల్పాడు. ఆ మాటలు వింటుంటే వాడిమీదుండే అసహ్యం ద్విగుణీకృతమైంది.

శంకర్‌కు, నాకు సంబంధం విడిపోయినతర్వాత అతడు రాఘవయ్యతో ఏవో మంతనాలు చేయటం మొదలుపెట్టాడు."

విశూ అడిగాడు. "మీరు ప్రేమించిన వ్యక్తి పేరేమిటో చెబుతారా ?"

ఆమె విచిత్రంగా నవ్వింది. "నే నెప్పుడూ పేరడగలేదు. నాకు పేరుతో అవసరం ఎప్పుడూ కనిపించలేదు. నాదగ్గరికి ఇదివరకు ఎంతోమంది వచ్చేవారు. వారు నాపేరును గురించిగాని, నేను వారిపేరును గురించి గాని ఎప్పుడూ ప్రస్తావించుకోలేదు. నాకు తెలిసినంతవరకు శంకర్ అతడిని "రావు" అంటుండేవాడు. శంకర్ రావుతో ఇదివరకటంటే ఎంతో అన్యోన్యంగా పూసుకుతిరుగుతుంటే నేను భయపడ్డాను. ఓవిధంగా రావు అమాయకుడు. నామీద ప్రతీకారంతో అతడిలో ఎ విషభావాలు ప్రవేశపెడతాడో అని శంకించేదాన్ని. కొద్దికాలంలోనే నా'శంక' నిజమయిందని ఋజువయింది. రావు ఓరోజు చాలాకోపంగా నాదగ్గిరికి వచ్చాడు.

"చూడు. నేనిక్కడుండడం బాగుండ్లేదు. మా అమ్మవ్రాసిన ఈ జాబులు చూడు. వూరంతా నవ్వుకుంటున్నారట. అమెకు తలవంపుగా వుందట."

నేను తలవంచుకుని నిల్చున్నాను.

"శంకర్ నేనేమో నీకు అడ్డుతగుల్తున్నానని చెప్పాడు. ఎవర్నీ బాధ పెట్టడం నావంతు కాదు."

మెల్లిగా ఎవ్వరో తలుపుతట్టారు.

శంకర్ వచ్చాడు. ఆ సమయంలో అతడంటే నాకు మండిపోయింది.

"శంకర్, దయచేసి నువ్విక్కణ్నుంచి వెళ్లు. నువ్వు నన్ను ఇంకెంత కాలం సాధిస్తావో చూస్తాను. నీచత్వంలో అధిగమించిపోయావు." ఇంతలో కే ప్రక్క గదినుంచీ ఇద్దరు వచ్చారు. అమ్మా, రాఘవయ్యా-"ఏమిటి ఎరిగున్న ఆ పెద్దమనిషిని అలా తూలనాడుతావ్? మాటా మంచీ ఏం అక్కర్లేదా?" అంది అమ్మ.

"నువ్వు అడుక్కుతింటావంటే నే దిగులుపడను-కాని, మమ్మల్ని అడుక్కుతినేట్టు చేయబోకు" చుర చురా 'రావు' వంక చూస్తూ "నువ్వే కారణం ఈ తుపానుకంతా!" అంటూ వెళ్ళిపోయాడు రాఘవయ్య. శంకర్ సగర్వంగా, స్వగతంగా—చాలా సంతోషించాడు.

"గొడ్డుటావుసు ఎన్నాళ్లు గోకినా ఒకటే....నీ వెఱ్ఱిగాని" అంటూ నిష్క్రమించి పోయింది అమ్మ.

శంకర్ మెల్లిగా అన్నాడు: "రావు, నేను నీకు నీతులు చెప్పడానికి రాలేదు, నువ్వుండే పరిస్థితిని బట్టి, నువ్వు మీ అమ్మగారికి నెరవేర్చాల్సిన బాధ్యతను, గౌరవాన్ని బట్టి నువ్విక్కడనుంచీ ఎంతత్వరగా విడుపడితే అంత మంచిదని చెప్పటానికి వచ్చాను."

రావు చేతనాచేతనాలన్నీ పోయినవాడిలా సుంచున్నాడు. "క్షమించమని అడుగుతూ ఓ విషయం చెబుతున్నాను. మీ అమ్మగారికి శరీరస్వస్థత లేదని కర్ణాకర్ణిగా వింటున్నాను. బహుశః నువ్విక్కణ్నుంచి విడుదలపడానికి ఎటువంటి అటంకమూ వుండదు. ఎందుచేతంటే, నువ్వు డబ్బు విషయం విచారపడనవసరంలేదు కనుక. ఈ పర్సులో మూడువందలున్నాయి. నీయిష్టం" అంటూ శంకర్ పిల్లిలా వెళ్ళిపోయినాడు. ఎంత ఆప్త మిత్రుడు?....ఒకప్పుడు రావు అతిదీనంగా, పరీక్షరుసుంకోసం అర్థించినా చిల్లిగవ్వ ఇవ్వని నిర్భాగ్యుడు, వీడు! నన్ను వల్లోవేసుకోడానికి, అడ్డింకి తప్పించుకోడానికి మూడువందలు అనాయాచితంగా, సులభంగా ఇచ్చివేశాడు! రావుమనస్సులో లోకాలు తిరిగిపోయినయి. పిచ్చివాడిలా పరిగెత్తాడు. ఎక్కడికో!....

"రావ్, ఎక్కడికి ? వుండు. నా మాట విను." అని ఆక్రందిస్తూ అరిచిన నా ఆర్తనాదానికి గదిలోని గోడలు ప్రతిధ్వనించాయి. పోయాడు ! "గొడ్డుటావు" అన్న అమ్మమాట అతడ్ని వేటాడుతుంటుంది ! "ఎక్కడికి పోయాడు నా రావు ? నా ఆశ్యాజ్యోతీ ఆరిపోయినట్లేనా ?" రెండురోజులు దిండులో తల దూర్చి. కుమిలిపోయినాను. నా రావు రాడా ? నా రాజు లేడా ? ?

నేను నిశ్చయించుకున్నాను. కార్యసాధకుడు అయిందానికి విచారించడు. అతడి దృష్టి ఎప్పుడూ భవిష్యత్తంతా కలయదిరుగుతుంది.

అప్రయత్నంగా గదిలో వ్రేలాడగట్టబడిన దివ్యరూపుడు వివేకానందుని చిత్తరువు చూశాను. ప్రపంచాన్ని శాసించే గంభీరత, సత్యాదర్శము ఆ మహనీయునిలో వుట్టిపడుతున్నాయి. ఎన్నోసార్లు ఆ దివ్యమూర్తి వంక చూశానుగాని ఎందుకో ఈసారి నాలో మహత్తరమైన మార్పు తీసుకొచ్చాడు. ఆ ప్రవక్తలో ఎంత ప్రశాంతత !

తమ్ముణ్ణి లేపి ఆయన వూర్లో వున్నారో లేరో కనుక్కురమ్మని పంపాను. మాట్లాడలేని స్థితిలో వున్నాడనీ, తనతో ఏం మాట్లాడక, అర్థంకాని చూపులతో వింతగా చూశాడనీ చెప్పాడు.

గుండెలో తుపానులు చెలరేగాయి. శరవేగంతో డాక్టర్ని పిల్చుకొని వెళ్ళాను ఆ గదికి. మెల్లిగా లోపలికివెళ్ళి అతడ్ని మృదువుగా స్పృశించాను.

"ఎందుకొచ్చావ్ శశీ ?"

"ఇప్పుడు నన్నడక్కండి."

డాక్టరు రావును నన్ను మాట్లాడవద్దని సంజ్ఞచేసి, జాగ్రత్తగా పరీక్షించి, చేయవలసిన సదుపాయాలన్నీ చెప్పి, మందిచ్చి వెళ్ళిపోయాడు.

వారంరోజులైంతర్వాత మామూలుస్థితిలోకి రాగలిగాడు. ఓరోజున అడిగాడు "డాక్టరుకి డబ్బు ఎవరిచ్చారు ?"

"మిమ్మల్ని చూసి జాలిదలచి డబ్బు అడగలేదు" అన్నా ఏమంటాడోనని!

"నన్నుగూర్చి ఎవ్వరూ జాలిపడమని కోరను. నన్ను పరిహారంగా ఆయన అమ్ముకున్నా సంతోషిస్తాగాని" కోపంతో అన్నాడు.

"మరేమీ అనుకోబోకండి. నా చంద్రహారాన్ని అమ్మాను" అతడు అనహాయంగా, సిగ్గుతో తలవంచుకున్నాడు, బీదరికంలో వున్నందుకు ఎవరన్నా అవమానపడుతుంటే "రావు" మొదటివాడనే అనాలి. ఇద్దరం ఆ గదిలోనే వుంటున్నాం. ఎవరన్నా ఒకరు ఆర్జించనిది కాలంవెళ్లదు.

"మనం వుండటానికి డబ్బులేదు. ఎలా జీవించడం?" అన్నాడు భోజనం చేస్తూ ఓరాత్రి. ఒక్కసారి మనస్సు ప్రకంపించింది.

"మీకు తెలును నే నిదివరకు ఎలా సంపాయిస్తున్నానో. మీ అభ్యంతరం లేకపోతే మనకోసం ఏమన్నా చేయవానికి సిద్ధపడుతున్నాను."

రావు వణికిపోయాడు.

"నేను నిన్ను ఈ విషయంలో శాసించే స్థితిలోమాత్రం లేను. అయినా ఓ హృదయపూర్వకసన్నిహితుడిగా, శ్రేయోభిలాషిగా ఒక్క విన్నపం. మీరు ఆ వృత్తి దయచేసి మానేయరూ?"అన్నాడు. గంభీరంగా— ఈ భాగ్య వంతులంతా పిరికివాళ్ళు. ఏమీ పనిచేయకుండా, పనిచేసి కృశించే అభా గ్యులధనాన్ని, అన్యాయమనన్నా లేకుండా హాయిగా అనుభవిస్తున్నారు."

నాస్వామికి మనస్సులో నమస్సుల్ని అర్పించుకున్నాను. అప్పటినుంచి 'రావు' విధిరామంలేకుండా ఉద్యోగంకోసం అన్వేషించడం మొదలుపెట్టాడు. కార్యసాధనకోసం ఎంత కష్టాన్నయినా లెఖ్ఖచెయ్యలేదు.

చాలా విచారంతో కూర్చున్న అతడ్ని ఓరోజు అడిగాను: "మీ కెక్కడా వుద్యోగం దొరకలేదా?" నవ్వాడు.

"వుద్యోగం చెయ్యడానికి సమర్థతని, విజ్ఞానాన్ని చూస్తే ప్రపంచం ఇట్లా వుండదు."

"ఏమయిందీ ?...."

"నాసర్టిఫికేట్లని, యోగ్యతాపత్రాలన్నిటిని సరిగా ఎవ్వరూ చూడలేదు. నేనో అనామకుణ్ణని చూడ్డానికికూడా ఎవ్వరూ రమ్మనలేదు. భాగ్యవంతుడు సాటివాడికే ఎప్పుడూ ఇచ్చుకుంటాడు. రానురాను వాళ్ళు ధనవంతులయి

ఈ ప్రపంచాన్ని ఓ మధురకలగా భావించుతారు. మనం ఇలా కృంగిపోవలసిందేనా క్రమక్రమేణ ఈలోకం ఒకనరకం, కాగా ?''

''పోనీ, మీ కభ్యంతరం లేకపోతే నేను....'' దుఃఖంతో మాట్లాడలేకపోయాను. మృదువుగా ఆ పొడుగాటివేళ్లతో నా కురుల్ని సరిదిద్దుతూ, ''నేను ఆత్మాభిమానంవిషయంలో బీదవాణ్ణికాదు. జ్ఞాపకముంచుకో. ప్రపంచం తాత్కాలికంగా దుష్టుల్ని గౌరవించినట్లగపడొచ్చు. సత్యాదర్శం కోసం ఎదురీదుతాను ఏమైనాగాని దొంగ పట్టుబడనంతమాత్రాన అపని అభినందించవలసింది కాదేమో !''

''దొంగతనం చేయడానికి ముఖ్యకారణమేమిటి మనదేశంలో ?''

''అవసరం. ఉచితానుచితాలకీ, మంచి చెడ్డలకీ చాలా భేదం వుంది.''

''నేను వుండబట్టి మీ పరపతి చాలా చెడిపోయింది. మీ వియోగం నాకు ఏం కలిగిస్తుందో నాకు వదలిపెట్టండి. మీకన్నా జీవితం సాఫీగా సమస్తుందని....త్యజించండి నన్ను....''

''వద్దు శశీ. ఎక్కడికన్నా మన్నెరుగని చోటికి లేచిపోదాం'' దగ్గరికి తీసుకొని గుండెలకి గట్టిగా అదుముకున్నాడు. అస్పష్టస్వరంతో—''ఒక కొరత జీవితంలో శాశ్వతంగా తీరింద.'' అన్నాడు. ఒక్కక్షణం బాధల్ని, సాంఘికగౌరవాన్ని, ప్రపంచాన్ని మరిచాం. కష్టాలు కానని లోకంలో స్వేచ్ఛావిహంగాలం మేం. కడుపులో ఆకలి బాధిస్తున్నా—నాకు బాగా జ్ఞాపకం—మేం ఆ పరవశత్వంలో కరిగిపోయినాం.

ఎంత సేపయిందో తెలీదు. ఎవరో పెద్దగా అతడిపేరు పిలుస్తూ తలుపు తట్టుతుంటే నేను మెల్లిగా లేచాను.

రావు ఆ స్వరాన్ని పోల్చుకున్నాడు. ముఖం పాలిపోయింది.

తలుపు తీశాడు. శంకర్ మొదట వచ్చాడు. తర్వాత మెల్లిగా శశి అమ్మా, రామయ్యా, తర్వాత ఓ పెద్దమనిషి. అందరికంటే చివర ఓ శోకమూర్తి—రావు తల్లి, వచ్చారు.

రావు వినయంగా అందరికీ నమస్కరించాడు. అమ్మపాదాల్ని స్పృశిస్తే

ఆతల్లి ప్రేమ పొంగిపోయింది, కొడుకుని, తన రక్తాన్ని బాష్పాలతో కౌగలించుకొంది. ఎన్నాళ్లయిందో చూసి! ఇద్దరూ చాలాసేపు అలాగే వుండిపోయారు. శంకర్ చూపుల్లో విషముంది. కాని, అస్నిగ్ధమాతృమూర్తి అశ్రుధారల్లో కరిగిపోయినాడు—వాడూ....

వీరంతా ఇలా పనిగట్టుకొని రావడమేమిటి? శంకర్ అన్నాడు—"నే నిక్కడకు వచ్చి మిమ్మల్ని భంగపరిచినందుకు క్షమించండి. వీళ్లకు దోవచూపడానికి మాత్రమే వచ్చాను. నమస్తే." వెళ్ళిపోయాడు. పిల్లిలా పారిపోయాడు.

నే నీ ప్రతిఘటించే సముద్రాలని ఎదుర్కొనే స్థితిలో లేను. నామాట వారు నమ్మరు! రాఘవయ్య పేలాడు—"నువ్వు మాకేగాక ఒక తల్లీని, కొడుకుని వేరుచెయ్యడంలో ప్రముఖపాత్ర వహిస్తున్నావ్?"

అమ్మ అంది: "నీ కిక్కడ వుండటానికి ఒక్కక్షణమన్నా స్థానంలేదు. నీ అభివృద్ధిని నువ్వు నిరోధించుకోవటం చూస్తూ ఎన్నాళ్లు వూరుకోగలం!"

అ వచ్చిన పెద్దమనిషి అన్నాడు: "అమ్మాయీ, నువ్వెవరివో నాకు తెలియదు. కాని ఓవిధంగా కల్పించుకున్నందుకు ఏమీ అనుకోబోకు. మీరు ప్రేమంటే ఏమో తెలియని అజ్ఞానవయస్సులో వున్నారు."

రావు తలెత్తాడు ఏదో చెబుదామని.

"అమ్మ అంది నిన్నుగురించి మా కందరికీ విచారంగా వుంది. నువ్వు ఎవ్వరి సాహచర్యం చేస్తున్నావో, అందులో ఎటువంటి పరిస్థితుల్లో మా అబ్బాయితో నేస్తం నెరిపావో అదిమాత్రం ఎన్నటికీ సిద్ధించరాదనే మీ ఉభయుల శ్రేయస్సుకోరి చెబుతున్నాను."

నేను ఈ ములుకులవంటి మాటల ఘాటికి తాళుకోలేకపోయాను. రావుజీవితం నా సాహచర్యంవల్ల ఏమీ బాగుపడే అవకాశం నాకు గోచరించ లేదు. ఎందుకింతమందికి అసంతృప్తి? అందరికీ తిరిగి నమస్కరించి, రావువంక "క్షమించమన్నట్లు చూసి వెళ్ళిపోయాను. నేను వస్తే చాలను కున్న అమ్మా, నాన్నా వెంటనే నన్ను బండిలో తీసుకెళ్ళారు. కాని రావు ఎలా వున్నా డనుకున్నావ్? దీనాతిదీనమైన, ప్రాధేయపూర్వకమైన చూపు

చూశాడు. గొంతు సవరించుకొని ఏదో చెప్పబోయాడు. కాని ఏం మాట్లాడ లేకపోవటం ప్రత్యక్షంగా చూడకలిగాను.

"అమ్మా" అంటూ కూలబడిపోయాడు.

"తర్వాత నాకు తెలిసింది" ఆమె ఆగింది రోగిని చూస్తూ. విశూ అతి ప్రయత్నంమీద తేరుకున్నాడు. ఘోరంగా దగ్గుతూ తొట్టిలో వుమ్మేశాడు. దాంతోపాటు చాలా రక్తంకూడా పడింది. అమె చాలా భయపడింది.

"డాక్టర్, డాక్టర్" అంటూ వెళ్ళే అమెను బలవంతగా అపాడు. "నేను కొన్నిగంటలు జీవించాలంటే డాక్టర్ని పిలవవద్దు. నన్నెవ్వరేం చెయ్యలేరు! కనీసం నాప్రక్కని కూచొని అతడి జీవితగాథని చెప్పు. నీ శ్రమకు నేనేం ఋణం తీర్చుకోగలను కనుక !"

"ఎందుకు అంత ఆత్రుత అతడి గతించిన జీవితంమీద?"

"నా జీవితచరిత్ర అడుగబోకు. ఓవిధంగా మా ఇద్దరి జీవితాలూ ఒకటే. అందుకే....అన్నాడు విశూ.

"అవును. చాలామంది జీవితాలు విచిత్రంగా ఏకీభవిస్తుంటాయ్."

అతడు కన్నుల నీరు నించుకున్నాడు. గత జీవితచరిత్ర ఆ కన్నీటిలో ద్యోతకమౌతున్నది.

" విను. అతడిపై నాకు మమకారం పోదు. రోజూ మా వీథిని పోతుంటే చూసి సంతోషించేవాన్ని. తమ్ముణ్ణి అతని యోగక్షేమాలు కనుక్కురమ్మని ఎప్పుడూ పంపుతుండేదాన్ని.

తల్లి అతడికి నీతినిగురించి, సాంఘికమర్యాదను గురించి చాలాచెప్పిం దట. ఆ వచ్చిన పెద్దమనిషి చాలా శ్రీమంతుడట. జాలితలచి చదువు పూర్తయేవరకూ వూరికే సాయం చేస్తానన్నాడట. ఇది ఒకవిధంగా నిజంగా జరిగిందనే చెప్పవచ్చు కొంతకాలం.

ఎందుకంటే, రావు నిజంగా మారిపోయాడు. దుస్తులు, అన్నీ మారి పోయాయి. ఆ అమాయికముఖతేజం ఏ చీకట్లో దాచాడో! తమ్ముడు అగుపడి నప్పుడల్లా డబ్బు యిచ్చేవాడు.

ఓ రోజు తమ్ముడు చెప్పాడు: "అక్కాయ్, నీ కిదిగో డబ్బు ఇవ్వాలిట. ఇదిగో ఆయనిచ్చిన పర్సు" అని యిచ్చాడు.

నాకు ఆశ్చర్యం కలిగింది. నన్నవమానపరచడానికేగాని ఇది ఇవ్వ టం! ఆ డబ్బును కోపంతో అవతల పారేశాను.

ఇంకోరోజు వాడు ఆత్రుతగా వచ్చి అన్నాడు: "ఏం చెప్పను అక్కయ్యా! ఆయన ఎలా తాగుతున్నా డనుకున్నావ్! నేను వెళ్ళితే నాకు యివ్వటానికి వచ్చాడు. 'ఎంతో ఆనంద మిస్తుందట' అంటారాయన. గదిలో శంకర్, ఆయన, ఇద్దరు రూపవతులైన స్త్రీలు....ఏం చెప్పను?" అన్నాడు.

నేను నమ్మలేదు. ఇలా మారిపోతాడని నే నెన్నడూ అనుకోలేదు. నా సాహచర్యం నశించినందుకు ఉన్నతస్థితిలోకి వస్తాడనుకున్నాను. కాని....ఆ రాత్రే బయలుదేరి అతడి బసకు పోదలచుకున్నాను, ప్రచ్ఛన్నంగా. క్రిందికి పోయినప్పుడు శంకర్, రౌడి రాఘవయ్యా మంతనాలు చేస్తున్నారు.

శంకర్ అంటున్నాడు: "పిచ్చపిల్ల! సన్యాసి రానుకుంటే బూడిద రాల కేం చేస్తుంది?'

రాఘవయ్య అన్నాడు: "ఇదిగో, శంకర్ నీ కోసం వచ్చారు?

ఆ కోపంలో మాట్లాడలేక పోయినాను.

"నువ్వు పిచ్చిదానవని ఋజువుచేస్తాను. ఎందుకంచే ఒక త్రాగు బోతుని, ఓ వ్యభిచారిని అత్యంత ఘనునిగా ఎంచి వలిచావు. అలాం టప్పుడు నే నేవిధంగా అతడికంటే తీసిపోయానో అర్థం కావటంలేదు.

నేను రివ్వున వెళ్ళిపోయాను. నన్ను అతడు అనుసరిస్తాడనే పరిజ్ఞానం లేకుండా.

"రాఘూ" గదితలుపు లోసి లోపలికి వెళ్ళాను.

గది అంతా పరిమళద్రవ్యాల్తో నిండివుంది. బాగా తాగాడేమో—సరిగా గుర్తుపట్టే పరిజ్ఞానంపోయిం దతనికి.

"రాఘూ, ఇటూ చూడు" అన్నా.

"ఎవరూ ?" అన్నాడు.

"నేను" అన్నా ముసుగు తీసి.

"ఎందుకొచ్చావ్ ?" అన్నాడు.

అలాంటప్పుడు ఏం చెప్పను ?

"చూడు. మీ అమ్మగారికి, పోషించే ఆ దాతకి ఎంత అన్యాయం చేస్తున్నావో !" అన్నాను.

"న్యాయాన్యాయాల సంగతి నా కనవసరం. నీ కిక్కడ స్థానంలేదని తేల్చబడిందికదూ ? పోరాదూ ? నీకైనా మంచిది" అన్నాడు.

అతడి కెంత చెప్పినా అర్థంకా దిప్పుడనుకొని వచ్చేస్తుంటే శంకర్ యమభటుడిలా తారసిల్లాడు.

"నేను నిన్ను అనుసరిస్తున్నాను. నేను నిన్ను, రావుని నాశనంచెయ్యగలను. ఈ సంగతి అతనికి సాయంచేసే దాతకి చెబితే ఏమవుతుందో వూహించు" అన్నాడు.

"ఏం చేస్తావు ?" అన్నా ప్రజ్వరిల్లుతూ.

"నామాట విను."

"ఏమిటీ, నన్నెన్నాళ్లు సాధించదలచుకొన్నావు ?"

"నువ్వు సౌందర్యదేవతవి. అసలు నాకోసమే పుట్టావని నానమ్మకం. చూడు, మన నేస్తాన్ని ఎందుకు బూడిదపాలు చేస్తావు ?" అంటూ దగ్గిరికి రాబోయాడు.

"ఛీ, నీచుడా ! నిన్ను దేనితో పోల్చాలో తెలీదు. నే నెవరిననుకుంటున్నావ్. స్త్రీ శక్తిస్వరూపిణి ! దగ్గిరికి వచ్చావంటే నిన్ను చీల్చేస్తాను. నీతో నేస్తంకంటే గర్జించాను.

"నువ్వెన్ని చెప్పినా వినపడవు నాకు. నీస్వరమే నాకు సంగీతం" నామీద పడ్డాడు. బలవంతంగా పెనుగులాడి, పెద్దగా అరిచాను. దూరాన ఎవర్నో చూసి "చూడు నా తడాఖా త్వరలో చూపిస్తా" అంటూ ఆ నిశీథంలో కలిసి పోయాడు.

శంకర్‌ది పాముపగ. తనకు లాభం లేకపోయినా ఒకళ్లు నష్టపడితే సంతృప్తిపడే తరగతికి చెందినవాడు.

రావు జీవితానికి శాశ్వతవినాశం చేకూర్చాడు. ఆ పోషించే పెద్దమనిషికి ఏ కల్లబొల్లివిషయాలు వ్రాశాడో కాని ఆయన సాయంచెయ్యటం మానేశాడు. పరీక్షలు దగ్గరికికూడా వచ్చాయి.

అదే చివ్వరిసారి అతడ్ని చూడటానికి వెళ్లటం. పుస్తకాలు, గుడ్డలు, అన్నీ చిందరవందరగా పడిపోయినలు. తుపాను చెలరేగినట్లుంది గదిలో. చాప మీద రెండుజాబులు వున్నాయి. చూశాను తడిసిన ఆ లేఖల్ని!

ఒకటి : సాయంచెయ్యడంవల్ల ధనాన్ని దుర్వినియోగంచేస్తున్నట్లు తను భావించడంవల్ల విరమించడమైందని ఆ దాత వ్రాశాడు. రెండోది అన్నిటి కన్నా ఘోరమయింది. ఒక ప్రచ్ఛన్నుడని సంతకంవుంది. అందుట్లో ఎఱ్ఱసిరాతో వ్రాయబడిన వాక్యాలు ఘోరాతిఘోరమయినవి. "మీకీవిషయం చెప్పడానికి చాలా చాలా ఆలోచించాను. విచారపడుతున్నానుకూడా. ఎందుకంటే హీనంగా ఆర్జించే విత్తానికి విలువనివ్వరని నాకు తెలుసు. మీకు సాయంచేసిన పెద్దమనిషి వ్యభిచారనీ, మోసకాడనీ తెలియక పోవడం చాలా దురదృష్టం. ఆయన వూరికే ఎందుకు డబ్బు పంపుతున్నాడో ఆలోచించారా?...............సంగతేమంటే—వారిద్దరిమీద పుకార్లు వున్నాయ్. మీకు ప్రత్యక్షంగా ఈ విషయాన్ని ఋజువుపరచడానికి తగిన ఆధారాల్ని సేకరించాను. ఇంతకంటే ఎక్కువ చెప్పడం అనవసరం."

ఎవరీద్రోహి? ఏమనుకుంటాడు, రావ్? దస్తూరీని పరిశీలించి చూశాను. శంకర్! అవును, శంకరే వ్రాసేడు. గుండె పగిలి చచ్చిపోలేదుకదా నారావు?" చుట్టూరా కలయజూశాను.

ఇంటికి పోయేటప్పటికి తమ్ముడు ఎదురొచ్చాడు. నాలో, ఒక్కసారి ఉద్రేకం పొంగిపోయింది. వాడితో చెప్పాను. శంకర్ "హీనకృత్యాన్ని."

శంకర్ ద్రోహి. అతడి చూపులో విషం వుంది. శిక్షాస్మృతిలో ఇతడికి శిక్ష వుంటుందా?

" శంకర్ వారంరోజుల్నించి నా కగుపళ్ళేదు. ఒకసారి రావు పూరికెళ్ళాడని" తమ్ముడుతో కబురంపించాడు.

విధిలేక వాడూ, నేనూ ఈమహాపట్నంలోని వీథివీథిని, వాడవాడనా తిరిగాం, రావుకోసం ! ఎక్కడా జాడలేదు.

అతడికి అంత అయోమయంగా వుంటుంది. ? అందుట్లో ప్రపంచంలోని మాయలు వూహించని స్థితిలోనే వున్నవాడు.

అవును. ఆమెకు భర్త లేడు ! హిందూవితంతువు ! కామవాంఛాపరుడైన పురుషుడు ! పూరికే సాయం చెయ్యడం ! ఈర్ష్యవున్న ప్రతివాడూ లోపాల్ని వెతికే విషమసమయం !

* * *

నేను దుఃఖాంబుధిలో మునిగిపోయినాను. తిరిగి ఈ మానవప్రపంచంలో విహరిస్తానను కోలేదు. కాని ఒక్క ప్రతీకారం కోసమే జీవించివున్నాను. శంకర్ ! అత నగుపడితే పొడిచి, చీల్చి చీల్చి చంపేస్తాను ! ఒక జీవితాన్ని నిర్దయగా రాచి వేశాడు. రావు పరీక్షల సమయంలో జరిగిందీవిషాద ఘటన ! అమ్మా, రాఘయ్యల బలవంతంమీద నాలుగు మెతుకులు తినడం ! నామమాత్రంగానే నిలిచివున్నా.

* * *

పాతికేళ్ళు నెమ్మదిగా దొర్లాయి. మళ్ళీ ఎప్పుడన్నా శంకర్ నాదగ్గరికి వస్తాడనుకున్నానా ?

ఓనాడు హఠాత్తుగా శంకర్ సరాసరి నాగదిలోకి వచ్చి కాళ్ళుపట్టుకొని వెక్కివెక్కి ఏడవటం మొదలుపెట్టాడు. నేను మొదట అతడిని గుర్తించలేదు. ఆ విపరీతవాలకం !....అంతా విరక్తిజెందినవాడిలా వున్నాడు.

"ఎవరూ ? శంకర్" అన్నాను లేస్తూ.

చాలాసేపు విలపిస్తూ అతడు మాట్లాడలేక పోయాడు.

"నన్ను క్షమించమని అడగను. నువ్వు విధించబోయే శిక్షను విని, శిరసావహించడానికి వచ్చా" నన్నాడు.

నేను మాట్లాడలేదు.

"నాకు, నిజంగా, రావు, శిక్షవించవలసినవాడు. కాని అతడ్నిగురించి నా కేమీ తెలీదు." అన్నాడు.

నే నాస్థితిలో అతడ్ని నిందించదలచుకోలేదు. అసలే నడుంవిరిగిన పాము! "నీకతన్ని గురించి తెలిస్తే ఏమన్నా చెప్పు. ఎల్లాగయినా రక్షిద్దాం."

"నేను రెండు సంవత్సరాలు అతన్ని జాడతీసే ప్రయత్నంలో తిరిగాను-విఫలుణ్ణయి."

"ఎక్కడున్నావ్ ఇన్నాళ్ళూ ?"

"రెండేళ్ళు ప్రచ్ఛన్నంగా దాక్కున్నాను. నామీద ఘోర్జరీనేరం వస్తుం దేమోననుకుని. అలాంటి దేమీ అగుపళ్ళేదు. తర్వాత నాగుండెల్లో ఏదో బరువుగా బాధించడం మొదలుపెట్టింది. నేను చేసిన ఘోరాన్నిగూర్చి ఆలోచించుకున్నాను. రావుని వెతకాలి. అతడ్ని వెదికి నా సోదరుని చేసి, ఆ తల్లికొడుకుల జీవితాలకి ఆత్మశాంతి చేకూర్చాలి. నా ఆస్తి అంతా ఆ ప్రయత్నంలో విసర్జించదలంచుకున్నా నంతోషంగా. కాని రావుజాడ తెలీలేదు. అతనికి పిచ్చెక్కిందని కర్ణాకర్ణిగా అన్నారు. హిమాలయాలకు పోయాడని అంటే అక్కడికి పోయాను. ప్రభుత్వంమీద విప్లవంజరిపే యువకవీరులతో తిరుగుతున్నారన్నారు కొందరు. అసలు జీవించాడా ? నాకు నమ్మకంలేదు.

ఇద్దరం విషాదంగా చాలాసేపు మౌనముద్ర వహించాం. చివరికి అత నన్నాడు: "నా విజీతాన్ని ప్రజాసేవకోసం అంకితం చెయ్యాదలచు కొన్నాను. అందుకే అనాడే న్యాయవాదవృత్తికి తిలోదకాలిచ్చి బొంబాయి వైద్యకళాశాలలో చేరి పట్టభద్రుణ్ణయి వచ్చాను."

"నువ్విప్పుడు వైద్యుడి వన్నమాట ?"

"అవును. ఒకందుకు నువ్వీవిషయంలో సాయం చెయ్యాలి."

నేను మాట్లాడలేదు.

"నా ఆస్తి సగం అమ్మాను. మనిద్దరి ఆత్మశాంతికోసం ధర్మవైద్య శాల నిర్మింపదలిచాను. మానవసేవతో అంతమవుదాం."

నేను బాగా ఆలోచించాను.

"ఇంతకంటే నేను ఏం చెయ్యాలో తోచడంలేదు. నాకు సమ్మతమే."

శంకర్‌కళ్ళల్లో ఆనందజ్యోత్స్నలు వెల్లి విరిశాయి.

"రావు అమ్మ ఎక్కడుంది ?" అన్నాడు.

"ఈ వూళ్లోనే పిచ్చిగా తిరుగుతుంటుంది - ఒకచోట వుండదు."

"ఆమెను యావజ్జీవితం పోషించే భారం నామీద వుంది."

ఇద్దరం అంగీకరించి "ఆమెను" ప్రార్థించాం.

కాని ఆమెకు అర్థంకాదు. "నేనిలాగా వుంటాను, తింటాను. మా అబ్బాయి ఎక్కడున్నాడో వెతుక్కోవద్దూ" అంటుంది. ఎన్నిసార్లు చెప్పినా వినలేదు.

ఇద్దరం అప్పటినుంచీ ఈ వైద్యశాలని స్థాపించి పనిచేస్తున్నాం. నిన్న పరీక్షించాడే అతడే డాక్టర్, శంకర్.

ఆ మాతృమూర్తి రోజూ వచ్చి మమ్మల్ని వాడుకగా వాళ్లబ్బాయినిగురించి అడుగుతుంటుంది. మాకు విసుగులేదు. మాకు రోజుకోత— నన్ను ఆప్యాయంగా "నర్సుకోడలు" అంటుంది. ఇష్టమైతే మేమిచ్చిన వేమన్నా తీసుకుంటుంది. లేకపోతే లేదు."

—ఆమె నెమ్మదిగా ముగించింది.

"అయిపోయిందికదూ ?" రోగి విశూ ఘోరాతిఘోరంగా దగ్గాడు. రక్తం కక్కుకున్నాడు. అసహాయంగా ప్రక్కమీద వాలిపోయాడు.

"డాక్టర్, డాక్టర్" అంటూ ముల్లోకాలు ప్రతిధ్వనించేటట్లు అరుస్తూ పరిగెత్తింది. నర్సు....

ఆ ఆర్తనాదానికి వార్డులోని నర్సులు, డాక్టర్లూ ఆమెగదివైపు పరిగెత్తారు. రోగినాడి నీరసించిపోయింది. అందరికీ నమస్కరించాడు. ముసలిదాది ముఖంలో కత్తివాటుకు నెత్తురుచుక్కలేదు.

* * *

ఆ పిచ్చిదానివెంట పిల్లలు అరుస్తూ పరిగెత్తుతున్నారు.

మామూలుగానే "నర్సు కోడలా!" అంటూ ఆమె ఆస్పత్రిఅంతా పెటిక్కెది. నిశ్శబ్దంగా వున్న ఆ గదిలోకి శరవేగంతో వచ్చింది! కాళీదేవిలా ఆ నినాదం! రోగి— విశూ చెవుల్లో ఎన్నడూ వూహించుకోనంత మహిమంగా వినబడింది! ఏదో మాట్లాడబోయినాడు, గాని మృత్యుదేవత గొంతు నొక్కుతున్న అసహాయుడు!....

డాక్టరుకి ఆ సమయంలో ఏమీ తోచలేదు. ఆమెవంక అయోమయంగా చూశాడు. అందుట్లో రోగి చావుబతుకుల్లో వున్న సమయం— !

దాది ఆమెను అనుసయిస్తూ "ఇక్కడి కెందుకొచ్చావ్ ఇప్పుడు?"అంది.

ఉన్మాది పెద్దగా అరిచింది. "మా అబ్బాయిసంగతి మీకు తెలుసుకదూ? ఇంక, మరి ఎవర్ని అడగమంటారూ?"

అంటూ రోగిని ఎగాదిగా చూసింది!

"అవును. మాట్లాడబోకు. ఇదిగో పడుకున్నవాడే మీ అబ్బాయి. సరేనా" అంది సమాధానపరచడానికి ప్రయత్నిస్తూ ఆ ముసలినర్సు! ఒక్కసారి, రోగి, తన గంభీర, విశాల, అందమైన, శాశించే నేత్రాల్ని తెరిచాడు. అతడికి మాట పడిపోయింది. కాని అతడికి ఎవ్వరూ అగుపడలేదు. తనని పరీక్షగా చూసే ఆ మాతృమూర్తితప్ప....

..............................

ఎక్కడినించి వచ్చిందో మృత్యువును ముద్దుపెట్టుకొనే ఆ రోగికి ఆ శక్తి! ఒక్కవూపులో ఆ పిచ్చిదాని పాదద్వయం చుట్టవేసుకున్నాడు. అతన్నెవ్వరూ ఆపలేదు. ఆపలేరుకూడా! అందరూ విభ్రాంతులై చూశారు వారివంక!

"అమ్మా! నన్ను తనివితీరా చూడు. మీ అబ్బాయిని. అమ్మా....అమ్మా.... అమ్మా" లోకాలు మారుమోగేటట్లు ఆక్రందించాడు. అదే అతడి ఆఖరి అరుపు. ఆయాసంతో, ఆత్రుతతో ఆమెపాదద్వయంమీద కట్టకడపటిముద్దునుంచాడు. అంతటితో ఆ పాదాలు అతడి రక్తంతో కడగబడి అరుణకాంతులు దాల్చాయి.

దాది, తేలిపోయే కళ్లతో, ఆ దారుణదృశ్యాన్ని చూసింది.

మూర్ఛపోయిన దాదిని, అతిదారుణంగా మరణించిన విశూని, చూసి అందరూ ఉద్వేగంతో వణికిపోయారు.

ఆ పిచ్చితల్లికి ఇదేమీ అర్థమైనట్లు మాత్రం అగుపించ లేదు.

"మీరంతా నన్ను పిచ్చిదాన్ని చేస్తున్నారు. సూర్యబింబంలాంటి శరీర కాంతి. రంభైనా వరించే రూపలావణ్యం. కలువపూవుల్లాంటి కన్నులు!.... ఇతడా మాఅబ్బాయి ?? నా కెప్పటికైనా అగుపడకపోడు. నన్ను గుర్తు పట్టకపోయినా నేను గుర్తుపట్టగలను! నా మాట తిరస్కరించడు వాడు. నాకు తెలుసు మా అబ్బాయి" ఆమె వికటహాసంచేస్తూ పోయింది.

* * *

శంకర్, దాదులవిషయం నా కనవసరం. ఇప్పుడాపిచ్చితల్లి ఏమైందో నాకు తెలియదు. విశూజీవితాన్ని చూసి ఏడవాలో, నవ్వాలో నిర్ణయించ లేను. కాని జీవించే, జీవించబోయే ఏ తల్లికిగాని, ఎటువంటి అపరాధాని కైనా, అటువంటి జీవితాన్ని మాత్రం ప్రసాదించవద్దని-మనల్ని ఈ లోకంలో పాలించి, శాశించే శక్తి ఏదన్నా వుండివుంటే - ప్రార్థిస్తాను. ఆమె వాళ్ల బ్బాయికోసం ఇంకా ఈ విశాలప్రపంచంలో ఏమూలో-తల్లిని ఏడిపించే అల్లరి బాలుడిలా - దాక్కున్నాడేమోనని వెతుకుతుంటుంది! అందుకే ఆమె జీవించి దేన్నీ లెక్కచెయ్యకుండా పరతపిస్తున్నది!..................

....బహుశా ఎప్పుడైనా మీ దగ్గరి కొచ్చి "మా అబ్బాయిని చూశారా? కలువపూవుల్లాంటి కన్నులు...." అంటూ వర్ణిస్తుంది అనుకోండి..............

....ఏం చెబుతారూ ఆ మాతృదేవికి మాతృదేవికి?..................

## ప్రచురణలో వున్న 'ఘట్టి' రచనలు

| | |
|---|---|
| ఆశ్రయహీన | ( నాటికా సంపుటి ) |
| అమరాన్వేషి | ( ,, ) |
| మగువ మనస్సు | ( ,, ) |



ప్రతులకు, వివరాలకు :

డాక్టరు, ఈ. పార్థసారధి B. V. Sc.

ప్రకాశకుడు 'ఆరాధన' గ్రంథమాల

20, కలతియప్ప మొదలి వీధి, వేపేరీ - మద్రాసు-7

